# శ్రీరామ పట్టాభిషేకము

(ఏడంకముల నాటకము)

జమ్ములమడక - లక్ష్మీనరసింహము

శ్రీ

# శ్రీరామపట్టాభిషేకము

గ్రంథకర్త:

జమ్ములమడక లక్ష్మీనరసింహము.



ప్రకటనకర్త:

కందుల గోవిందం, బెజవాడ

1925

| | |
|---|---|
| ఘోరప్రతిక్రియ | రు 1-8-0 |
| కుసుమ | 1-4-0 |
| పచ్చప్రదొంగ | 1-0-0 |
| వీరాబాయి | 0-14-0 |
| సాహసిక | 0-12-0 |
| మానసింగు | 1-0-0 |
| కాళిక | 1-0-0 |
| ప్రచండభైరవి | 0-12-0 |
| వనదుర్గము | 1-0-0 |
| కాళిదాసుచరిత్ర | 1-0-0 |
| ఆత్మసామ్రాజ్యము | 1-0-0 |
| కలికాలచర్య | 0-6-0 |
| ఆంకాభిరామాయణం | 0-6-0 |
| కేసరీవిలాసము | 1-0-0 |
| చిత్రలేఖ | 0-10-0 |
| ప్రసన్నముఖి | 1-0-0 |
| ప్రహసనములు | 0-8-0 |
| భారతాభ్యుదయము | 0-12-0 |
| కర్పూరమంజరి | 1-0-0 |
| సౌందర్యతిలక | 1-0-0 |
| అహల్యాబాయి | 0-12-0 |
| రామచంద్రవిజయం | 0-12-0 |
| హేమలతి | 0-12-0 |
| కృష్ణవేణి | 0-6-0 |
| మణిమంజరి | 0-6-0 |
| నందచరిత్ర | 0-4-0 |
| వినోదములు | 0-8-0 |
| డిటో రెండవభాగము | 0-8-0 |
| గణపతి 1 భాగము | 0-12-0 |
| డిటో రెండవభాగము | 0-12-0 |
| రఘుకులచరిత్ర | 0-10-0 |

| | |
|---|---|
| రాజరత్నము | 0-1 |
| అరహసింగరి | 0 . |
| హామీర్ సింగ్ | 0. |

—♦ వైద్యగ్రంథములు. ♦—

| | |
|---|---|
| యూనానీవైద్యం | 0- |
| ధన్వంతరీవిజయం | 0- |
| నేత్రదర్పణం | 0 |
| వ్రణచికిత్స | 0 |
| అనుభవ గృహవైద్యం | 1 |
| రసరోగరత్నాకరం | 1 |
| సహదేవపశుచికిత్స | 0. |
| రసప్రదీపిక | 0 |
| అనుపానమంజరి | |
| షడ్వైద్యజీవనం | |
| సుఖరోగచికిత్సారత్నాకరం | |
| శతలేహపాకప్రకాశిక | |
| పానీయకల్పవల్లి | |
| ఆయుర్వేదసారసంగ్రహం | |
| నాడీనక్షత్రమాల | |
| నాడీపరిజ్ఞానము | |
| సుఖవ్యాధిచికిత్సాచంద్రిక | |
| హరికథలు—ఆ. నారాయణదాసు | |
| మార్కండేయచరిత్ర | |
| హరిశ్చంద్రోపాఖ్యానం | |
| రుక్మిణీకల్యాణము | |
| జానకీశపథము | |
| అంబరీషోపాఖ్యానము | |
| భీష్మచరిత్ర | |
| గజేంద్రమోక్షం | |
| సూర్యనారాయణ శతకం | |
| సారంగధరనాటకం | |

వలయువారు:—కందుల గోవిందం, బెజవాడ, కృష్ణాజి

# ప[illegible]యము

## ఏడంకముల నాటకము

ఇది

బాలకవి జమ్మలమడక లక్ష్మీనరసింహముగారిచే
రచియింపఁబడినది.



ప్రకటనకర్త:
కందుల గోవిందం,
బెజవాడ, కృష్ణాజిల్లా.

మొదటికూర్పు : 1000

బెజవాడ:
ఆంధ్రగ్రంథాలయ ప్రెస్ (లిమిటెడ్) యందు
క. కోదండరామయ్యగారిచే
ముద్రింపఁబడియె.



1925

రక్తాక్షి



[వెల ప్రతి 1కి 1-0-0

శ్రీరస్తు.

# శ్రీరామపట్టాభిషేకము

—o—

## నాంది

జనకుఁ [illegible] గానసము ♦ సంతసమొప్పఁగ నేగి, దుష్టులఁగా
దునిమి, ప్లవంగశేఖరుల ♦ తోఁ దగు మైత్రినిఁ జేసి, దుష్ట రా
వణుని వధించి రాజ్యపరి ♦ పాలనఁ జేసిన యట్టి [illegible]
యునికరుణావిలోకములె ♦ యొప్పఁగ మీపయిఁ గ్రాలుగావు[illegible]

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించుచు)

సీ॥ ముల్లోకవంద్యుండు, ♦ మోహనాకారుండు
ప్రాజ్ఞుండు, ఘనుఁడు, శ్రీ ♦ రామమ[illegible])
జనాశ్రితుం, ♦ డాద్యుండు, నములుండు
ప్రముఖసద్గుణుఁడు శ్రీ ♦ రామమ[illegible]
క్తజనులఁగాచు ♦ భవ్యుండు, వరదుండు
రాక్షసాంతకుఁడు శ్రీ ♦ రామమూర్తి [illegible]
[illegible]ంధిమర్త్యుడు ♦ ధరణీవరేంద్రుండు
రమ్యచరిత్రుఁడు శ్రీ ♦ రామమూర్తి
రాజితానందమూర్తి శ్రీ ♦ రామమూర్తి
ప్రథిత విజ్ఞానమూర్తి శ్రీ ♦ రామమూర్తి
ప్రాథ సత్కళాస్ఫూర్తి శ్రీ ♦ రామమూర్తి
ప్రబలనుతి నిత్యకీర్తి శ్రీ ♦ రామమూర్తి

॥ తక్కనకవిఁ, బాలకను, హ[illegible] ♦ శక్తిభాస్క[illegible]
తే॥ [illegible] తనరఁ బావరాజని, ♦ ఘనతేరంగ

నాథు, నింకపై నెంద ఱెం ♦ దరినో? వసుధ
ధన్యులనుజేసె శ్రీరామ ♦ ధారుణీ
దివ్యచరితంబు, కాన సం ♦ దేహమేల?
పావదే యిది నాదుపా ♦ పములఁగూడ.

పుణ్యాకరమైన శ్రీరామునికథ యెట్టిదైనను
మాన్యముఁగదా! నేఁ డరణ్యకాండము మొదలుకొని, యుద్ధకాండ
"శ్రీరామపట్టాభిషేకము" అను పేరఁ గొరుతాడిపల్లి
వాస్తవ్యులగు, బాలకవి జమ్ములమడక లక్ష్మీనరసి
గాయింపఁబడు, పెదరావూరు వాస్తవ్యులును నేతద్గ్రంథ
లునగు, బ్ర॥ వే॥ జగర్లపూడి వెంకటప్ప
డిన యేడంకముల పుణ్యనాటక ప్రద
ఇఁక జాగేల? (కొంచెము ఆఁగి) అప్పుడే
కూర్చిరత్వముఁగూరిచి మారీచుఁ డేమో య
డు. పోయెదను.

(అని

[ తెరపడును ]

---

నేఁ

వైదర



శ్రీ

# శ్రీరామపట్టాభిషేకము

—:o:—

## ప్రథమాంకము

### రంగము ౧.

(ప్రదేశము — లంకాపురిరాజస్థానము.

మారీచుఁడు ప్రవేశించును.)



నేటియుదయమున నాస్వామియగు రావణుఁడు నన్నుఁ జూచి "మారీచా! దండకారణ్య మధ్యప్రదేశమున శ్రీ సీతారామలక్ష్మణులు నవీనపుకాపుర మేర్పఱచుకొన్న పర్ణశాలప్రాంతమునకు నీవొక ... తురంగమవై చని సీతకు భ్రాంతిఁగలిగించి యెట్లయిన రామ ...లను నెడఁబాపుము. పిమ్మట నేను భిక్షుకరూపమున నచ్చట ...రైన ...కాంతాలలామను నాపుష్పకము మీఁద నిడుకొని లంకా...ము. కుఁ దెచ్చుకొందును" అని యాజ్ఞాపించియున్నవాఁడు. ...లయాజ్ఞ యవిలంఘనీయమే కాని యింతటిఘోరకార్యము నేనెటు ని...మను? శ్రీరామచంద్రుఁడవతారపూరుషుఁడు. దుష్టులశిక్షించి ...క్షింపవచ్చిన మాయామానుషవిగ్రహుఁడు. ఆమహానుభావుని ...చింతును? సీతామహాదేవి పతివ్రతాశిరోమణి. ఆసాధ్వి ...ని నపహరింపవలయు నను దుర్బుద్ధి యీదైత్యేశ్వరున కేల జని...చెనో కదా? లంకారాజ్యమున కేమి యుగచాట్లు రానున్నవో? హా! విధీ! — పంక్తికంధరుఁ డిచ్చటికే గుదెంచుచున్నాఁడు.

(రావణుఁడు ప్రవేశించి)

రావ—మారీచా! యింకను జాగుఁజేసెద వెందులకు?

మారీ—దేవా! రాఘవేంద్రుఁ డవతారపూరుషుఁడు. అనుహాత్ముని నేనెటుల వంచింతును? సీతామహాదేవి పతివ్రతాశిరోమణి. ఆసాధ్విని మీ రెటుల లంకాపురమునకుఁ గొనిపోయెదరు?

రావ—మారీచా! నేను చెప్పిన చొప్పున నీవు ప్రవర్తించు నెడల రాముని వంచించుటన నెంత? సీతాదేవినిఁ గొనివచ్చుటన నెంత? నీ వీకార్యముఁ గడు జాగరూకుఁడవై నెఱవేర్ప వలయును.

మారీ—రాక్షసేశ్వరా! రామచంద్రుని పరాక్రమము నేను బాగెఱుంగుదును. పసితనముననే గాధేయుని మఖరక్షణ లక్ష్మణునితో నేగుదేరి యొక్క బాణమున మాసుబా జంపినాఁడు. వేఱొక బాణము నాపైవిడువ నే నీలంకా వచ్చి పడితిని.

రావ—మారీచా! మీ రిరువురు మున్ను కౌశికయాగవిఘ్నకారకులా?

మారీ—లంకేశ్వరా! అవును. ఆ భగవానుని ధైర్యసాహసము లనిఘములు. ఆమహాబలునితో మీరు వైరముఁ బెట్టుకొనఁ దగదు.

రావ—ఓరీ! నీ కతిప్రసంగమేల? నాయాజ్ఞ శిరసావహించి ర్పుము.

మారీ—దానవేశ్వరా! అకారణముగ నాకేల మరణముఁ గూ

రావ—ఇందు నీకేమిమరణమున్నది?

మారీ—నేనొక మాయాకురంగమునై భ్రాంతిగల్పించుచు సీతారామ లక్ష్మణుల పర్ణశాల ప్రాంతమునకరిగిన నన్నా దాశరథి వేఁటాడి సంహరించును.

—నీవ్రభుని గూర్చి నీ వంతయు త్రము ప్రాణముల నర్పింపఁ జాలవా?

—రీ—లంకేశ్వరా! యీ విషయమున మాత్రము నన్ను మీరు క్షమింపవలయును. రామలక్ష్మణుల వంచించి సీతాదేవిని యీగచాట్లపాలుచేయుటకు నాహృదయము సమ్మతించుటలేదు. మీ రిట్టి పనికి సాహసించుట శ్రేయస్కరము కాదు.

—వ—(కోపముతో) ఛీ! దురాత్మా! క్షమింపవలయునా? నాపరిపాలనలో నామూలమున బ్రతుకుచుండి, నాకై యెట్టిశ్రమలైనఁ బడవలసినవాఁడవై యుండియు, నేనుచెప్పినచొప్పున కెదురాడుట యేకాక, యింక నన్నధిక్షేపించుచు నీతులంగఱపెదవా! నా యీయాజ్ఞను నీ వుల్లంఘింతువేని నిన్నిప్పుడే యీఖడ్గమునకు ...చ్చెదను చూడుము.

...ఈ క్రూరాత్ముఁ డింతటిపనికి సమర్థుఁడు. పంక్తిగ్రీవుని ...ను హైన్యనవు మృత్యువును బడయుటకంటె మాయా...నై పోయి యాశ్రీరామచంద్రుని చేతిమీఁదుగనే ...మోక్షసామ్రాజ్యపదవిఁ బడసెదగాక! (ప్రకాశముగా)

...కేశ్వరా! ఆగ్రహము వలదు. మీయాజ్ఞానుసారముగాఁ ...చెదను.

...గా!

...టులైన శీఘ్రమే నీ విఁకఁబొమ్ము.

...త్తము. (నిష్క్రమించును)

...ప్రపనులకు మారీచుఁడే సమర్థుఁడు! నాకోరిక ఫలించును. ఆ ...రాముని పై ఖరదూషణాదులవధియించి శూర్పణఖను భంగిం...చిన నాకోపము దీర్చుకొనెదను.

(అని లోపలకుఁబోవును)

(తెరపడును)

## రెండవరంగము

ప్రదేశము—పర్ణశాల.

(రాముఁడు, సీత, లక్ష్మణుఁడు ప్రవేశింతురు)

రాము—జానకీ! నీకిది యేమికోరిక?

ఉ॥ బంగరులేడిఁజూచి యిటు ♦ భ్రాంతివహించితి వేమి
నిం గొనివచ్చు టెందులకు! ♦ నిష్ఫలమే కద! రాక్షసుం
భంగిని లేడిరూపమున ♦ వచ్చినవాడు నిజమ్ము సుమ్ము న
మ్మంగను రామ రక్కసుల ♦ మాత్రము సుంత, సరోజ వదనా.

సీత—నాథా! ఆలేడి నాకు భ్రాంతిఁగొల్పినది. (వ్రేలితో [illegible]
అదిగో! అటు! అటు! అటు! చూడుఁడు! అక్కడ
నది. ఎంతమనోహరముగనున్నది! ఆహా! యేమిదా
నా సంగతి యట్లుంచి, మీ రెటులున్నది చెప్పుఁడు?
త్కాంతుల నీనుచున్నది! కనులకు మిఱుమిట్లు గొ
కదా! వచ్చిపట్టుకొందు రేమో యని బెదరి బెగ్గరపడ
చూపులఁ జూచుచున్నది కాదా! మనోహరా! దానిం

లక్ష్మ—(తనలో) అబ్బా! యీమెపట్టే యీమోహ[illegible]ని
మాటల వినఁజాలదు కదా! ఆఁడువారికుండు స్వ[illegible]
(ప్రకాశముగా) సీతామహాదేవీ! నీ వాకోరికను
ఏలన?

మ॥ మనలన్ వంచనఁ జేయ నివ్విధమునన్ ♦ మాయాకృతిం
చ్చెను, వీఁడెవ్వఁడో రాక్షసుం డొకఁడు నీ ♦ చిత్తంబు న
దనె పోనీకుము; పెక్కుచిక్కులు తట ♦ స్థంబౌను నావ
వినుమా! (రామునిఁజూచి) పట్టెద వేమొ దాని? సదయా
చుదీ

సోదరా! స్త్రీలమాటలఁ బాటించి యుద్యద్గతి సాహ

సీత—స్వామి ...కము. ఆలేడిమూలమున మనకేమికష్టములు కలు... నాకు ముచ్చటయగుచున్నది. అదియే నా ... న నింక నీ కాంతారమధ్యమున నెంతో సుఖముగాం గాలముం గడుపుదును. (రామునింజూచి) ప్రాణేశ్వరా! జాగు చేయక దానిం బట్టుకొనిరండు. లక్ష్మణుని మాటలకేమి?

రాము— ...! ఆమాయామృగము చిక్కునా?

చం॥ కనం ...క్కచోట చను ♦ గాననసీమను ...బడించినన్
...ంత, వేగమెప్ప ♦ కాశిలు వేఱొకచోట, వెంటనే
గనం వెత్తు, దాగు, నిటు ♦ కేరడమిచ్చెను ...సిల్ల ప
నిడుమ ల్లభించు, ప్రక ♦ టింపకు నీమదిం గోర్కె నింత ప్రియా॥

...—లు

అదియేమియో రాక్షస మాయగానున్నది!

సీత—మనోహరా! తమ్మునిమాటలం బాటించి నాకోరికం ద్రోసివేయకుండు. ఎట్టులైన నాహరిణముంబట్టితెండు. నాకు సంతసముం గూర్పుండు.

లక్ష్మ—మగవారు వలదన్నదానిని గూర్చియే యాడువారెక్కుడుగం బట్టుపట్టుదురుకదా! మైథిలీ! ఆమాయామృగము నీకు వల ... వినవేమి?

సీత—...క్ష్మణా! దానిపై నాకు భ్రమకలిగినది.

లక్ష్మ—ఎందుల కాభ్రమ?

రాము—భ్రమకాదు. పట్టుదల.

సీత—నాథా! పట్టుదల నాకున్న మీకుంగూడ నెందుల కుండవలయును? మీరైనవిడిచి నాకోర్కెందీర్పరాదా?

రాము—దేవీ! యేమిచిత్రమో కాని యాలేడి చిక్కుటలేదు. బాణము విడిచిన గతించును.

సీత—గతించిన నేమి?

లక్ష్మ—నిష్కారణముగా నాసారంగమును వధించుటెందులకు? మనకు మహాపాతకము సంభవింపదా?

సీత—అటులైన నెందఱో రాజులు వేటలలో నెన్నెన్ని లేళ్ళను సంహరించుటలేదు! వారందఱకు మహాపాతకము సంభవించదా?

లక్ష్మ—వేటలందున సంహరించుట పాపముకాదు.

సీత—ఆలేడి యెటో పోవునంతవఱకీలాటి మాటలతో నే కాలము వెళ్ళబుచ్చుదమనకొంటిరి కాబోలు, హృదయేశ్వరా!

రాము—సాధ్వీ! పట్టుకొనుట కది చిక్కదు. పోయి సంహరించెదను.

సీత—సాధ్యమైనంతవరకు పట్టుకొను ప్రయత్నము నే చేయుడు. అంతగాఁ జిక్కకపోయిన సంహరించుకొని తెండు. దానిచర్మమయిన మన యీ పర్ణశాలయందుంచుకొనుదము.

రాము—ఇదిగో! వెళ్ళెదను.

లక్ష్మ—శ్రీరామచంద్రా! వలదు. వలదు. ఆడువారి మాటలతో నేమి? వేగిరపడకుము.

రాము—అనుజా! అడ్డుపెట్టకుము పోయెదను. నీ విక్కడనే యుండుము.

ఉ॥ ఈ సరసీరుహాక్షి ని, వ ♦ నీస్థలి నెవ్విధిఁ గాచువాఁడవో?
భూసుత యెప్పుడెచ్చటకుఁ ♦ బోయియెఱుంగని దాని గాన, యి
ప్డీసరణిన్ సుఖంబులకు ♦ నెంతయొదూరముఁ జేరె లక్ష్మణా!
మోసమువచ్చు రక్కసుల ♦ మూలమునన్ గనిపెట్టియుండుమా॥

(అని పోవుచు మరల తిరిగి)

లక్ష్మణా! సీత నేమఱకుండుము. భద్రము, భద్రము, భద్రము!
(అని నిష్క్రమించును.)

లక్ష్మ—స్త్రీలకదా యెట్టిపనులకైన సాహసధురాండ్రు!

సీత—సౌమిత్రీ! నీయన్నగారు లేడిని దవ్వుకొనిపోయిరి కదా!

లక్ష్మ—నీవేకదా పంపినదానవు. పట్టుకొనుట కాయెత్తుచిక్కక చిక్కులఁబెట్టుచున్నది! ఎట్లయిన దాని సంహరించుకొనిగాని యగ్రజుఁడు రాఁజాలఁడు.

సీత—ఆ హరిణము నాథుని చాలదూరము కొనిపోయినది కాఁబోలు! ఏమి చిక్కులఁ బెట్టుచుండెనో?

లక్ష్మ—అది మాయామృగము. మనకు వలదని యెంతచెప్పిన నీవు వినవైతివి కదా!

సీత—లక్ష్మణా! వినవైతిని.

లక్ష్మ—జనకరాజపుత్రీ!

తే॥ గీ॥ తాము పట్టినపట్టు భూ ♦ తలముమీఁద
నెగ్గవలయును, వనితలు ♦ సిద్ధిపొందు
మంచి చెడ్డలఁగూర్చి పి ♦ మ్మటనుకాంచ
మదినిఁ దలఁతురు కొన్నిపో ♦ మగువమిన్న!

స్త్రీల కిదియొక స్వభావము.

సీత—సౌమిత్రీ! ఆగు మాగుము! ఏదియో యార్తనాదము విన వచ్చుచున్నది.

లక్ష్మ—ఎక్కడ?

[ తెఱలో ]

హా! లక్ష్మణా! హా! లక్ష్మణా!

లక్ష్మ—అది రాక్షసకృత్యమని నేను ప్రప్రథమముననే చెప్పితినికదా!

సీత—ఊర్మిళాపతీ! అక్కడ నీయన్నగారి కేదియో ముప్పువాటిల్లినది. సహాయముఁ గోరుచున్నవారు. శీఘ్రము పోయి రమ్ము.

లక్ష్మ—శ్రీరామచంద్రుని కేమిముప్పువాటిల్లును?

సీత—లక్ష్మణా! అది నీయన్నగారినాదమే! ఏమికష్టము కలిగినదో జాగు సేయక వేగిరమే పోయిరమ్ము.

లక్ష్మ—అది రాక్షసుల పన్నాగమై యుండవచ్చును. నాయగ్రజున కేమియుఁ గష్టముకలుగదు. అయినమాత్రము నిన్నొకరిత నిందువిడచి పోవుదునా?

సీత—సౌమిత్రీ! నా కిందేమియును భయములేదు. ముందు నీవు నీయన్న గారికిఁ దోడుపొమ్ము.

లక్ష్మ—జానకీ! నీకీభ్రాంతియెందులకు?

సీ॥ కడుబాల్యమందునే ♦ కౌశికుయాగంబు
ఖలులరూపుసుమాపి ♦ కాచినాఁడు
బలవంతులెల్లరు ♦ పట్టియెత్తఁగలేని
హరువిల్లు నవలీల ♦ విఱచినాఁడు
క్షత్రియకులముల ♦ సంహరించినయట్టి
పరశురాముని భంగ ♦ పఱచినాఁడు
తండ్రియాజ్ఞనుబట్టి ♦ దండకాటవిఁజొచ్చి
క్రూర్మిదైత్యుల నెల్లఁ ♦ గొట్టినాఁడు

తే॥ గీ॥ అట్టి రామచంద్రుండేమి? ♦ హానిగనుట
పోయి యిడుములందుటయేమి! ♦ పొలఁతిమిన్న
కాల మదిమారి కష్టము ♦ ల్గలుగుఁగాక,
యిచట నినువీడి యే నెట్టు ♦ లేగఁగలనొ!

సాధ్వీ! అది రాక్షసకృత్యమేగాని శ్రీరామమూర్తి కట్టిముప్పును వాటిల్లలేదు. నీవు భయపడవలసిన యగత్యము లేదు. అగ్రజుండు లేడిపిఁగొట్టి తెచ్చుచున్నవాఁడు: నీ వెట్టికలతయుఁ బడకుము!

సీత—లక్ష్మణా! ఆలేడిమూలముననే నీయన్నగారి కేదియో యాపత్తు సంఘటిల్లినది. లక్ష్మణా! లక్ష్మణా! యని నిన్నుఁబిలిచియున్నవారు. నా కిందెట్టి భయమును లేదు. వారు వచ్చువంతవఱకు నే నిందు భద్రముగా నుండఁగలను. నీవుమాత్రము వేగమే నీ యన్నగారి దగ్గరకుఁబొమ్ము.

లక్ష్మ—ముగ్ధహృదయా! రాక్షసకృత్యములు వర్ణనాతీతములు. లోక బాధాకరములు. అబలవగు నిన్నొక్కరిత నిందు విడనాడి నేను పోనొల్లను, ఒల్లను.

సీత—(కోపముతో) లక్ష్మణా! నీ కేదియో దురభిప్రాయము జని యించుచున్న ట్లున్నది.

శా॥ కాంతారంబున రామచంద్రుఁడు మహా కష్టస్థితిం బొంది, వి
భ్రాంతిం జిక్కెనట లక్ష్మణా! యనుచుఁ బిల్వం, బోవు పాయంబు, నీ
స్వాంతంబందుఁ దలంప దేమిగాదా! సౌమిత్రి! నాతోడ సం
పంతం బేమిటికో? రఘూద్వహునిఁ గావన్ బోవ తప్పేనొకో!

లక్ష్మ—పతివ్రతాశిరోమణీ! నీవు నన్నుఁగూర్చి యిట్లుగాఁ దలఁప వలదు. శ్రీరామమూర్తిపై నాకుఁ బ్రేమలేక పోవుటకాదు; ఎట్టి దురభిప్రాయము మనమున నిడుకొని పోకుండుటకాదు; అగ్రజుని కష్టస్థితి యెఱిఁగి పోకుండఁ దగుటకాదు; కాననప్రదేశము లన నెట్టివో యెఱుఁగనిదానవు—తద్భూముల సంచరించు రాక్షసులఁగాని, వారి కృత్యములఁగాని, యెప్పుడు కని విని యెఱుఁగనిదానవు—బహుసుకుమారివి; నీవొక్కరిత వింధుండ వలసివచ్చునేమోయని నేను పోవుటకు సందేహించుచుంటిని. అదికాక నాయగ్రజుండు "లక్ష్మణా! సీత నేమఱకుండుము, భద్రము భద్రము భద్ర" మని గట్టిగాఁ జెప్పిపోయినవాఁడు. ముల్లోకరక్షకుండగు నాయగ్రజున కెట్టికీడును కలిగియుండదు. కాన జానకీ!—

సీత—(కోపముతో) ఛీ! దురాత్మా! నాకిప్పటికి నీసన్నాగము తెలిసివచ్చినది నీవు ద్రోహివి. శ్రీరామచంద్రునిపై నీకుఁగల యపారప్రేమ — యవ్యాజానురక్తి—యపరిమితభక్తి యిట్టిదని మాత్రము నేనెఱుఁగనైతినిగదా! నీవు మమ్ముల వనములకు వెంబడించిన దిందులకేనా? అగ్రజు నెట్లైనఁ బాఱఁద్రోలి నాతో నీవు సుఖముగఁ గాలముఁ గడుపనెంచితివి కాఁబోలు!

లక్ష్మ—(చెవులుమూసుకొని) పాపము శాంతించుఁగాక! సీతామహాదేవీ! యీమాటలేమి? నీకీకోపమేమి? శ్రీరామచంద్రుఁడు నాకు సోదరుఁడు. ఆతనిపత్నివగు నీవు నాకు మాతృసమానురాలవేకాని వేఱొండుకాదు. తల్లీ! నేను మీయెడ ద్రోహముచేయుదునా? రఘువరుని చరణాబ్జముల నమ్ముకొని యనుదిన మాతనికిఁ దగిన సేవలఁజేయుచు బ్రతుకవలసినవాడనేకాని జానకీ! కర్ణకఠోరమగు నెట్టిమాటఁ బల్కితివి? ఆమహాత్ముని వంచింతునా? అపకీర్తి వహింతునా? అధోగతిపాలగుదునా!

సీత—(కోపముతో) తెలిసినది. తెలిసినది. నీకపటవ్యాపారములు— నీకల్మషాంతఃకరణము—నీయమోఘసాహసముఁదెయు నేటితోఁ దెలిసినది. ఇక నూరకుండుము.

లక్ష్మ—(తనలో) అయ్యో! ఇప్పుడు నేనేమిసేయుదును? నాపలుకుల యందుకాని, నాయందుకాని యీమె కేసుమంతైన నమ్మకము లేదు. దుర్భాష లాడుచున్నది. ఈపలుకుల నేను వినఁజాలను. ఈసాధ్వి నొంటిగ నీ యరణ్యప్రదేశమున విడిచి యెటులఁ బోఁగలుగుదును? రాఘవుండు, "లక్ష్మణా! సీత నేమఱకుండు" మని యాజ్ఞాపించి పోయినవాఁడు. సోదరునియాజ్ఞ దాఁటవలసివచ్చుచున్నది. ఇఁక దాఁటకతప్పదు. జానకి నిందొంటిగా విడిచి యగ్రజుసన్నిధికి నేనుపోయిన "లక్ష్మణా! సీతనేల విడచివచ్చితివి?" అని యాతఁడు ప్రశ్నించిన నే నేమిసమాధాన

మిత్తును? ఆమహాత్ముని యాజ్ఞ నల్లంఘించినందున కాతఁడు నాపైఁ గినుకఁ జెందకుండునే? ఏమితోఁచదు? (కొంచెము యాగి) ఇఁక నిందుండరాదు. శ్రీరామునికడకుఁ బోయెదను (ప్రకాశముగా) జనకజా! నీమాటప్రకార మగ్రజునకు సాయముగాఁ బోయెదను. నీ విందుమాత్రము భద్రముగా నుండవలయును జుమా!

సీత—సౌమిత్రీ! త్వరగాఁబొమ్ము.

లక్ష్మ—భూమిజా! రాక్షసులు— భద్రము సుమా!

సీత—లక్ష్మణా! నన్నుఁగూర్చి నీవు భయపడవలదు. మీరు వచ్చునంతవఱకు నే నిందు భద్రముగానుండెదను. నీవు శీఘ్రమే పొమ్ము.

లక్ష్మ—సీతా! పోవుచుంటిని! భద్రము! భద్రము! భద్రము!

(అని నిష్క్రమించును)

సీత—అయ్యో! ఆమాయామృగమును చూచి నేనేల భ్రమజెందితిని? భ్రమచెందితినిపో! యట్టిగట్టిపట్టు నేలపట్టితిని? సౌమిత్రి మాటలఁగూడ పెడచెవులఁ బెట్టితిని. ఇప్పు డేమిచేయుదును?

మ॥ హృదయేశుండు వనంబులో నెచట యి ◆ ఱ్ఱిన్ గొట్టెనో? కొట్టినన్
మది శంకించెను, రారదేమిటికి న ◆ మ్మాయాకురంగంబుతో?
నది యేమో కద 'లక్ష్మణా!' యనుచు దై ◆ న్యంబేర్పడన్ వచ్చె నే
పదురో యయ్యది? రామచంద్రునకు సం ◆ ప్రాప్తించెనా కష్టముల్.

శా॥ ఆలేడిన్ గని భ్రాంతిఁ జెందితిని యే ◆ లా నేను? నద్దానికై
యేలాపంపితి రాఘవేశ్వరుని? యి ◆ ప్డీయార్తనాదంబు రా
నేలా? మోస మదేమివచ్చినదొ? నే ◆ నేమింక జేతున్ విధీ!
కాలంపున్ గతి యెప్పుడేమొ తెలియం ◆ గారాదు సుంతేనియున్॥

మ॥ చనినాఁ డిప్పుడె లక్ష్మణుండు రఘువం ◆ శశ్రేష్ఠునిన్ జూడఁ, గ
న్గొనెనో? లేదో? వనంబునం దెచటఁ దా ◆ గోరాడుచున్నాఁడొ? యా

తని(గూడన్ బనుపంగనేల? యిప్పుడిం ♦ తన గుందగానేల? త
ప్పనె యెవ్వారలకైన( గాలగతి దు ♦ ర్బుద్ధుల్ ప్రవేశించినన్॥

ఇపు డెంత పశ్చాత్తాపపడిన నేమి ప్రయోజనము? శ్రీరామ లక్ష్మణు లిరువురు సుఖులై పర్ణశాలనుజేర సర్వదేవతలు కాపాడుదురుగాక!

(భిక్షుకుని రూపమున రావణుడు ప్రవేశించి)
భవతి భిక్షాందేహి!

సీత—(తనలో) ఎవరో మహాత్ములు—(తొంగిచూచి) మునీశ్వరుల వలె నుండిరి. భిక్షుకువచ్చిరి. (అని వెలుపలకు(బోయి) మహాత్మా భిక్ష(గైకొనుడు.

రావ—(చిరునగవుతో) పంకజాక్షి! యిదియేమిభిక్ష?

సీత—సంయమీంద్రా! కాంతారమధ్యప్రదేశముల( గ్రొత్తగ( గాపురమేర్పఱచుకొన్న మేము మీ కింతకంటె నెక్కుడు తే(గలుగుదుమా? దయతో దీనిని స్వీకరింపుడు.

రావ—(తనలో) ఈముగ్ధకు నాయభిప్రాయ మింకను గూఢముగనే యున్నది. నెమ్మదిమీద తెలియ(బఱచెదను. (ప్రకాశముగా) కోమలీ! మీ రీకాంతారవాసమునకు నవీనులా?

సీత—అవును. వచ్చి కొల(దిదినములు మాత్రమేయైనది.

రావ—అటులనా! ఎందులకు(గాను మీ కీయరణ్యవాసము తటస్థమాయెను? మీరెవ్వరు?

సీత—యోగిపుంగవా! నేను మిథిలేశు(డగు జనకుని తనయను. అయోధ్యాపురాధీశ్వరు(డగు దశరథునకు( బెద్దకోడలను. శ్రీరామచంద్రుని భార్యను. పితృవాక్యపరిపాలనార్థమై నానాథు(డడవుల కనుజనితో నేగుదేర నేమను వారల వెంబడించితిని.

రావ—పితృవాక్యమేమి?

సీత—ముద్దులభార్యయగు కైకేయి దశరథభూపాలుని వరద్వయంబు కోరినది. అందు మొదటిది పదునాలుగేడ్లు శ్రీరాఘవేశ్వరునకు వనవాసము. రెండవది భరతునకు పట్టాభిషేకము.

రావ—దశరథుఁ డాయింతి కిట్టివరముల నెట్టులిచ్చెను?

సీత—ఎట్టివరములనైన నిత్తునని ప్రప్రథమమున వాగ్దానము చేసిరి. తుదకీ మాట తప్పరాదు. క్షత్రియధర్మము కదా!

రావ—దశరథుఁడు కైకేయికి రెండువరముల నేలయిచ్చెను?

సీత—తొల్లి యా పార్థివేంద్రుఁడు శంబరాసురుని యుద్ధమున కైకేయి యొనరించిన సాయమునకుఁగా నిచ్చియుండిరట!

రావ—అప్పటిమాటయా! సరి! సరి! (అని నవ్వును.)

సీత—(తనలో) ఏమి! ఈతని వైఖరి, విలాసము, నితనిచూపులు, పలుకులు, ఆతనినడకయు, వ్యాపారము నాకు సంశయమును గొల్పుచున్నవి. కానిమ్ము. యతిగదా! పూజనీయుఁడు! (ప్రకాశముగా) యతీంద్రా! మీకిక కాలమగుచున్నది. శీఘ్రమే యీ భిక్షను గైకొని పొండు.

రావ—సరోజనేత్రీ! యీమాత్రపుభిక్షకే నేనిక్కడకు వచ్చియుండలేదు. వచ్చినభిక్ష వేఱు.

సీత—(తనలో) నామఱఁది లక్ష్మణుఁడు రాక్షసులు మాయారూపులని చెప్పుచుండెడివాఁడు. అతనిమాటలు నాకిప్పుడు జ్ఞప్తికి వచ్చుచున్నవి. ఈతఁడెవ్వఁడో రాక్షసుఁడు. మాయారూపమున వచ్చినట్లు నాకుఁదోఁచుచున్నది. మునీశ్వరుఁడని భ్రమఁజెందితిని. ఏమిమోసము జరుగునో కదా! (ప్రకాశముగా) దేవా! యీ యాలస్యమెందులకు?

రావ—కళ్యాణీ! నీదయకు—ఈభిక్షవలదు—వ-ల-దు.

సీత—(తనలో) నాగుండియు ఝల్లుమనుచున్నది. నాయొడలు కంప మెత్తుచున్నది. ఏదియో కీడుకలుగనున్నది. (వెనుకకుఁదగ్గును)

రావ—భీతహరిణేక్షణా! భయపడెద వెందులకు?

శా॥ లంకారాజ్యము నేలుచుండెదను బా ♦ లా! నేను, శూరుండ, ని
శ్శంకన్ లోకములన్ని గెల్చెదను, నన్ ♦ సాధింపలేరెవ్వరున్
బింకంబంచుఁ దలంపఁబోకుము మహా ♦ వీరుండఁ, బౌలస్త్యుఁడన్!
సంకోచింపకు నన్నుఁ జేరుటకు నో ♦ సంపూర్ణచంద్రాననా!

సీ॥ ఎవని పేరును విన్న ♦ నెల్ల వేల్పులు నాక
మందున గడగడ ♦ లాడుచుండ్రు,
ఎవని యాజ్ఞకులోంగి ♦ యినచంద్రు లిర్వురు,
మింటిపై భయమున ♦ మెఱయుచుండ్రు,
ఎవని సాహసమెంచి ♦ నేమిసేయఁగలేక
దిక్పాలురు ♦ సడలఁగయుండ్రు,
ఎవని శౌర్యము, ధైర్య ♦ మెల్లలోకములచే
విడువక కొనియాడఁ ♦ బడుచునుండు,
తే॥ గీ॥ ఎవనిచే రాక్షసకులంబు ♦ వింకవృద్ధి
చెంది, దేవకులంబులు ♦ క్షీణమగునొ!
యెవఁడు ముల్లోకపూజ్యుండొ ♦ యెంచిచూడ,
సుందరీ! యట్టి రావణా ♦ సురుఁడ నేన!

కం॥ నాపేరెఱుఁగనివారలు,
నాపై నని సేర్చువారు ♦ నాతీ! కలరే?
నీపై భ్రమచే వచ్చితి,
నోపిక నను బ్రోవు మిప్పు ♦ డుత్పలనేత్రీ!

హంసగామినీ!

సీ॥ నీమోమునకుసాటి ♦ నెమ్మి గానెంచియే,
సగమాయె శోభామ ♦ చందమామ,
నీకన్నులకుసాటి ♦ రాకయొకాదెపో,
తలవంచె జలములోఁ ♦ గలువరేకు,
నీమధ్యమునుజూచి ♦ నిలువనోల్లకపోవు,
వేగంబె యోరామ! ♦ నాగుఁబాము,
నీయూరులకుజోడు ♦ నిలువఁజాలక పడుఁ,
గదళీతరువులెల్ల ♦ సుదతిమిన్న!
తే॥ గీ॥ నీదు నడకకు నెనఁగాక ♦ నీరజాక్షి!
నాగములు కానసంబుల ♦ నీగుచున్న,
వేలబాధింతువింక నీ ♦ లీల నన్ను?
నేలుకొనరాదె? నాదు ర ♦ త్నాలబొమ్మ!

శా॥ మారుండూరక సాయకమ్ములను జి ♦ మ్మఁగా నాగె నొక్కుమ్మడిన్
నారీ! నిల్వఁగఁజాలనేనిట మహా ♦ నందంబుఁ జేకూర్పవే!
శ్రీరాము న్విడనాడు మింతట జనూ ♦ శ్రీఁగొంచు నేనిన్ను లం
కారాజ్యంబున నేలుకొందునిక శం ♦ కన్ వీడ యబ్జాననా!

చం॥ కొఱఁత జనింపదెందులను ♦ కోమలి! నీకిట భీతియేమి? యె
వ్వరుఁ జనుదేర రాపురికి ♦ బంధుగులైనను యాజ్ఞలేనిదే?
వెలువకు మీవు సుంత, రఘు ♦ వీరుఁడు, లక్ష్మణుఁ డెవ్వఁడేనియుఁ
జొరఁబడలేఁడు కాన నిఁక ♦ సుందరి! యిప్పుడె నాతోఁ రాఁగదే!

సీ॥ హాయిగశయనింప ♦ హంసతూలికలుండ,
నెలఁతరో! యిచట తా ♦ నేలశేల?
రాజాన్నభోజన ♦ ప్రాప్తియుండఁగ, నిందు
ళలన! యీకంద మూ ♦ లంబులేల?

వసియింప నీకె దుఁ ♦ బైఁడి మేడలెయుండ,
బాల! యిచట పర్ణ ♦ శాలలేల?
కట్టఁగ మేనిపైఁ ♦ బట్టుబట్టలెయుండ,
చెలియ! యిచట నార ♦ చీరెలేల?

తే॥ గీ॥ వేల్పులను మించువాఁడను ♦ విభుడనుండ,
కాంత! యిచట రాఘవునిపై ♦ భ్రాంతియేల?
సిగ్గు, పంతంబు విడిచి న ♦ న్జేరరమ్మ
సందియంబేమి కల దింక ♦ యింపవదన!

మ॥ ఇట నీ రాముఁడు లక్ష్మణుండయిన లే ♦ నేలేఁడు నిన్గావనే
మిటి కింకన్ వను నిల్వు దీ విచటఁ గూ ♦ ర్మి న్సమ్మతి న్జూపుమా
యెటులైనన్ గొనిపోకమాన నిను, రా ♦ నీ యడ్డ మేవీరుఁ డి
చ్చట కేతేరునొ, నిన్నుఁగాచుటకు నో ♦ సంపూర్ణచంద్రాననా!

ఉ॥ నీదయఁజూపి నన్నుఁ గరు ♦ ణించినఁ బట్టపుదేవిఁజేతు, మం
డోదరి నీకుదాసియగు, ♦ నొక్కట లోకము లన్నిగొల్చు, ని
మ్మేదిని రామచంద్రునితో ♦ మెల్లను గాంతువె యెట్టివైన? రా
వే దయితా! వినుము సమది ♦ యే! యట సిగ్గిఁక పోనుసుంకపై॥

జాగు సేయకుము. నా నిజరూపముఁ జూడఁగోరెద వేని యిదిగో
యిప్పుడే చూపెదను. (అని నిజరూపముఁ జూపును)

సీత—(మూర్ఛనొందును)

రావ—ఈ నారీశిరోమణి మూర్ఛనొందినది. రామలక్ష్మణులు వచ్చు
కాల మాసన్న మగుచున్నది. వేగిరమే యీమెను నా విమాన
మునిమీఁద నిడుకొని లంకారాజ్యమునకుఁ బోయెదఁగాక!

[తెరపడును]



శ్రీ

# శ్రీ రామ పట్టాభిషేకము

—:o:—

## ద్వితీయాంకము

### రంగము ౧

ప్రదేశము—పర్ణశాల ప్రాంతారణ్యము.

(దుఃఖముతో రాముఁడును, లక్ష్మణుఁడు ప్రవేశింతురు.)

రాము—అయ్యో! సోదరా! యింకెక్కడి సీత ?

ఉ॥ సీతను బాయఁగూడదని ♦ చెప్పితినేకద యెన్నొమార్లు? నీ
వాతరళాక్షి నేటికి మ ♦ హాటవినుంచియె వచ్చినావురా!
నీతియులేనివాఁడవె? మ ♦ నీషుఁడవేకద! బుద్ధిమారెనే?
భీతిజనించెనే? కల వి ♦ వేకమడంగెనె నీకు? లక్ష్మణా!

ఉ॥ ఎందులకానరాదు వన ♦ జేక్షణ నెవ్వరు తస్కరించిరో?
కుందఁగ నేలరా యనుజ! ♦ గొబ్బున పైఁబడెనింకఁ గష్టముల్
సందియమందినాఁడ నల ♦ చయ్యన లేడికిఁ బోవుచప్పుడే!
సుందరి నెందుఁ జూచెదము? ♦ సోదర! యీ వనసీమయందునన్.

చం॥ పదపడి లేడికై చనుచు ♦ భద్రము, భద్రము సీతయంచు న
య్యదనునఁ జెప్పినాఁడనె క ♦ దా! మఱి పేటికిఁగల్గె నీకు? పో

పుడమిపు జేప్రదేశమున ♦ భానుకుఁజూడఁగ? తీరిపోయె నా
మదగజయాన కాలమిట ♦ మాటలతోఁ బనిలేదు సోదరా!

సీ॥ చూడ్కికి భ్రమఁగొల్పి ♦ వేడ్కతో మెల్లన,
నేల రావలయు నా ♦ యిట్టి యిటకు?
వచ్చెఁబో! కని దాని ♦ వనజాక్షి యాసీత
పట్టఁగ నన్నేల ♦ పంపవలయు?
పంపెఁబో! యత్నంబు ♦ భగ్నమైపోవ, నా
హరిణ మీవింతను ♦ జరుపుటేల?
జరిపెఁబో! యొంటిగా ♦ జానకి విడనాడి
వనముల సౌమిత్రి ♦ చనుటయేల?
తే॥ గీ॥ చనియెఁబో! వెనువెంటనే ♦ సఖికి నాకు
నీ యపూర్వవియోగంబె ♦ యేలకలిగె?
దైవమా! నన్ను శోధింపఁ ♦ దలఁచి నీవు
పన్నియున్నావె యిన్నియుఁ ♦ బ్రమద మలర?

హా! సఖీ! సఖీ! యేక్రూరుని బారిఁబడి యెంతచింతిల్లు చుంటివో కదా? ఈ లేడి మనవియోగమునకే వచ్చినదికాఁబోలు! మనల వంచింపవచ్చిన మాయామృగమని సౌమిత్రి చెప్పినమాటలఁ బాటిఁ జేయనైతిమికదా! ఎట్టిచిత్రము జరిగినది! ఎంతలో నెంతమోసము సంభవించినది! నారాకకై పర్ణశాలయందుండి యెదురుచూచుచుందు నని సంభ్రమమున లేడినిఁగొట్టుకొనివచ్చి చూచునప్పటికి — మనోహరీ! నాసంతస మెంతలో నంతమొందినది! ఎట్టి యిక్కట్టులు నాకు సంప్రాప్తించినవి! లక్ష్మణా! సీత భద్రము సుమాయని నొక్కిచెప్పి నేను కురంగమునకై వెడలిన కొంతతడవునకే యనుజుఁడు నాకడ కేగుదెంచి నప్పుడే, నాకుసంశయము జనించినది. వెంటనే పర్ణశాలకుఁ జనుదెంచి చూచునప్పటికి హృదయేశ్వరీ! హా! హృదయేశ్వరీ!

ఉ॥ వేసటఁజెంది యింక నర ♦ విందముఖీ! గహనంబులోన, నే
నాసనుదిర్గు డెక్కరణి ♦ నైననుకాని, కనంగలేమి నిన్

చేసెడి దేమియింక? నరి ♦ జెప్పెద రెవ్వరు నీదుజాడ? యీ
మోసముఁ జేసి డాగి రెట? ♦ పుణ్యజనంబులఁ గూల్పకుందునే?

ఉ॥ కాననసీమలను సతులు ♦ కాపురముండుట కూడదంచు నో
మానిని! చెప్పలేదె తిగ ♦ మాన్యు లయోధ్యను వీడునప్పుడే?
పూనికఁ బట్టుపట్టితివి ♦ పొల్పుగఁ జేయ నరణ్యవాసముల్
గాని యెఱుంగ వీ విచట ♦ కష్టసుఖంబుల లేశమేనియున్॥

ఏమియెఱుంగని దానవుకనుక నే ప్రేయసీ! యీ కష్టమునంభవించినది. ఏ రక్కసుని చేతిలోఁ జిక్కితివి? ఎంతకుందుచుంటివి? ఈ నీ నాథుఁడు వచ్చి రక్షించునని యెంతయాశతో నుంటివి? ఎట్టిభ్రమతో నుంటివి? సతీ! సతీ!

సీ॥ ఏనాఁడుకాని నీ ♦ వీలాటి గహనముల్
చూచియున్నావె? యో ♦ శోభనాంగి!
ఏనాఁడుకాని నీ ♦ వెఱుఁగుదువే? యిట్టి
రాక్షసకృత్యముల్ ♦ రమణిమిన్న!
ఏనాఁడుకాని నే ♦ [illegible]
గాఁ నినుఁ బాసి యో ♦ కమలనేత్రి!
ఏనాఁడుకాని లో ♦ నెంచియుంటిమె? యిట్టి
యిక్కట్టు కలుగునం ♦ చిందువదన!

తే॥ గీ॥ అన్ని యీనాఁడె సంప్రాప్త ♦ మాయె నేల?
యేల యీను లేల? విధికృత ♦ మిట్టులుండె
ప్రేయసీ! యెడనుంటివో ♦ వెదకు టెట్లు?
కానకుండిన నాకిఁకఁ ♦ గలదె బ్రతుకు?

హా! సీతా! సీతా! జనకమహారాజునకు ముద్దులబిడ్డవు. అవక్రపరాక్రమ సంపన్నుఁడగు దశరథభూపాలునకుఁ గోడలివి, వెఱపుఁ

జెందక సాహసించి నిన్నెవ్వరుకొనిపోయిరి? ఎవ్వరి నడుగుదును? ఎన్న
టికి నా యిల నిన్నుఁ జూడఁగలను? ప్రాణేశ్వరీ! ప్రాణేశ్వరీ!

మ॥ కలలోనైన నెఁదలంపనైతిఁగద నే ♦ కళ్యాణి! యీరీతిఁ బ
ల్గలఁతల్ సెందెదనంచు నివ్వనములోఁ ♦ గాలంబుభేదించె రాఁ
జెలఁగెన్ గష్టము లింకపై, నెటుల నే ♦ జీవింతునో యింతి యెం
దుల నీవుంటివో? యెట్టురాఁగలనో యీ ♦ దుఃఖంబువాపోవఁగన్.

ఉ॥ అన్నటంచుఁజూచుటకు ♦ నాభరతుం డిటకేగుదేరి, యో
యన్న! యిలాతనూజ యెట ♦ నం చనినాతని కేమిచెప్పెదన్
నన్ను తిరస్కరింప రె మ ♦ నంబులఁ దల్లులు? నెల్లబంధుగుల్
మన్నన జేతురే? యెటుల ♦ మాన్యుఁడ నయ్యెద భూతలంబునన్.

హా! జానకీ! జానకీ! పలుక వేమి? కనఁబడ వేమి! అయ్యో—
యిక్కడెవ్వరుండిరి? నాయనురాగి—జగన్మోహిని— నాభాగ్యములరా
శి—నాపుణ్యములపంట—పవిత్రచారిత్ర—సద్గుణశీల నాసీత యేది?
ఎదీ...? ఏదీ...?

సీ॥ సుఖలీల తనయను ♦ మీ రెప్పుడైన
గాంచియున్నారలే! ♦ ఖగములార!
దశకంఠుకోడలా ♦ తరుణిజాడను జె
ప్పఁగలేర మీరైన ♦ వనములార!
సీత యెచ్చోటను ♦ జేరెనో మీరైన
దయయుంచిచెప్పరే ♦ తరువులార!
రాముని భార్యను ♦ ప్రేమతోఁ గొనిపోయె
నెవఁ డెఱుఁగరె మీరు? ♦ మృగములార!

తే॥ గీ॥ ఎవరి నడుగుదు నేనింక ♦ యింతిజాడ
కరుణనుంతేనిరువరికిఁ ♦ గలుగదాయె
ననుజ! తెలిసె నేమిక లదురా! ♦ యావని మనకు
దైవ మీరీతిబాధింపఁ ♦ దలఁచినాఁడు.

హృదయేశ్వరీ! హృదయేశ్వరీ! మన పర్ణశాలయెక్కడ? మన కాపురమేది? మన భోగములేవి? మనకీ యాకాలిన వియోగమేమి? దేవుఁడెంత నిర్దయాత్ముఁడు! మన కిట్టి స్థితి తెచ్చిపెట్టినాఁడు! నాప్రాణప్రియా!

తే॥ గీ॥ లేక లేక గలిగిన బా ♦ లికవుఁగాన
జనకుఁ డెంతముద్దుగ నిన్ను ♦ సాకినాఁడో!
యాపని దురదృష్టవంతుఁడ ♦ నగుటవలనఁ
గోలుపోయితి నిన్ను నేఁ ♦ గోమలాంగి!

సోదరా! యీ కాంతారమధ్యమున నింక మన కాభూజాత కనఁబడునే!

లక్ష్మ—శ్రీరామచంద్రా! అబలలరీతి ధైర్యము విడనాడి యింత దుఃఖించెద వేమిటికి?

మ॥ విలపింపన్ బనిలేదు నీవిటులఁ బ్ర ♦ ధ్వక్ ధైర్యముల్ వీడి, యా
జలజాతేక్షణ నే నిశాచరుఁడో మో ♦ సంబెంచి కొంపోయె, నా
ఖలునిన్ బట్టి వధింత మింతట మహా ♦ క్రోధంబునన్ రమ్ము చిం
తిం నేలా యిటు నా టినా టికి ధా ♦ త్రీనాథ! భూజాతకై.

ఉ॥ సీత పతివ్రతామణి సు ♦ శీలకదా! రఘురామచంద్ర! యా
నాతిని తస్కరించిన జ ♦ నంబు సుఖంబునుగాంతురే? మహా
పాతకమంటఁ గాలరె? ఘ్రీ ♦ పెంపగు నింతయు నమ్మమయ్య నీ
నాతిం గాంక్షకై యిటుల ♦ సంధిలఁ జూడకు నెవ్వ శోకముల్.

కాన నిక నీవు విచారము మానుము. ఆసాధ్వీమణి జాడల నరయుదము రమ్ము.

రాము—సౌమిత్రీ! ఎందు వెదకుదము? సీతామహాదేవి జాడల మన కిందు చెప్పువార లెవ్వరు?—ఎవ్వరు?—ఎవ్వరు?

తే॥ గీ॥ ఓమునిశ్రేష్ఠులార! మీ ♦ రుండి రెందు
వినరె వనచరులార! నా ♦ విన్నపమును?—(కొంచెమాగి)

ఓ సురౌఘములార! మీ ♦ రుండి రెందు?
సోదరా! సీత నెచ్చోటఁ ♦ జూడఁగలము?

అయ్యో! దేవీ! దేవీ!—ఇం దెవ్వరు పల్కుదురు? ఈ పదునాలుగేండ్ల వనవాసము నెటుల గడుపుదును? ఎటులో పూర్తిగావించి యయోధ్య కేగుదేరిన "శ్రీరామచంద్రా! సీత యేది" యని యడుగు తల్లుల కేమిసమాధానమిత్తును? వసిష్ఠభగవానుని కేమిచెప్పుదును? తమ్ముల, నూర్మిళామాండవీ శ్రుతకీర్తుల నెట్లు లోదార్చుదును? ప్రజల దుఃఖము నెటులఁ బాపుదును? దైవమా! జనకమహాచక్రవర్తి కేమని వార్త నంపుదును? ఎంత మోసము తటస్థించినది! జనకమహాచక్రవర్తి కనుఁగు గూతురు— దశరథభూపాలునకుఁ బెద్దకోడలు--దురదృష్టుఁడగు రాముని యిల్లాలు—పతివ్రతాతిలకమగు సీత—నాసీత—అయ్యో! సీత యెందున్నది? ఎక్కడ నెక్కట్టు లందుచున్నది? సాధ్వీ! నిన్నే క్రూరుఁడు కొనిపోయినాడు! అతిబాల్యమునుండియు నల్లారుముద్దుగాఁ బెరిగినదానవు—పైఁడిమేడలవీడక, మృదుశయ్యలదిగక, సరసరాజాన్నభోజనసంతుష్టిచే సకలసౌఖ్యములఁ బడసినదానవు—అమూల్యపీతాంబరధారిణివై, అఖిలసద్గుణోపేతవై, అఖండితసౌఖ్యసంపదలచే నలరవలసినదానవు—సౌభాగ్యవతివై, సర్వజగన్మాతవై, సమస్తశోభలచే సకలదాసదాసీజన సపర్యలు జరుగుచుండ నేలఁగవలసినదానవు—కళ్యాణీ! యీ నిర్భాగ్యుని— యీ నికృష్టుని — యీ నింద్యుని గట్టుకొనుటచే కదా, యీ ఘోరవనవాస ప్రాప్తి— యీ శిలాకంటకభూములశయ్యలు నీకందమూలాదిభక్షణ— యీ జీర్ణవల్కలధారణ — యీ కష్టము— ఎడబాటు—వియోగము! దేవీ! దేవీ!

తే॥ గీ॥ పితరువాక్యముఁ బాలింపఁ ♦ బ్రేమతోడఁ,
గైక కోరికఁ దీర్పంగ ♦ గహనములకు,
వచ్చియున్నాఁడనే కాని ♦ వనరుహాక్షి!
క్రూరులకు నిన్ను విడువ నే ♦ కోరినాని?

లక్ష్మణా! సీత యింక మనకుఁ గనఁబడుననునాశ నిఁకుండెనే?

లక్ష్మ—దాశరథీ! నీకింత యధైర్యమేల? ఈదుఃఖమేమి?

రాము—లక్ష్మణా! యింక మనము సేయునదియేమి?

లక్ష్మ—అగ్రజా! వేగిరమే రమ్ము. రాక్షసుఁడే దాఁగియుండవచ్చును. అక్కడఁ జూడుము! ఎవఁడో పడియున్నవాఁడు.

రాము—(చూచి) ఆతఁ డెవఁడై యుండును? సీతజాడల నెఱుఁగునేమో పోయి యడుగుదము రమ్ము.

లక్ష్మ—అతఁడే భూజాత నపహరించెనేమో?

రాము—లక్ష్మణా! అది యేదియో పక్షిగాఁ దోఁచుచున్నది!

లక్ష్మ—రామచంద్రా! రాక్షసు లనేకరూపములతో లోకముల బాధించుచుందురుకదా!

రాము—అవును వాస్తవమే.

లక్ష్మ—సందేహమేమి? వీఁడు రాక్షసుఁడే!

రాము—(దగ్గరకుఁ జేరి) సౌమిత్రీ! యీపక్షినిఁజూడ నాకు వింత, జాలియుఁ గలుగుచున్నది.

లక్ష్మ—శ్రీరామమూర్తీ! దానినిమాత్రము నమ్మవలదు.

రాము—లక్ష్మణా! యిది యెవరితోడనో పోరి పోరి దెబ్బలుతిని పడిపోయి ప్రాణములవీడ సంసిద్ధముగనున్నదికదా!

లక్ష్మ—సీతాపతీ! రాక్షసకృత్యము లన్నియు నటులనే యుండును.

రాము—ఇది రాక్షసకృత్యము కానట్లున్నది.

(జటాయువు కొనయూపిరితో)

శ్రీరామచంద్రా! వందనము. అయోధ్యాపురాధీశ్వరుఁడగు నీతండ్రి దశరథభూపాలుని కేను ప్రాణమిత్రుఁడను; జటాయువును. లం

కాధిపతియగు రావణుఁడు నీభార్యయగు సీతామహాదేవినిఁ గొనిపోవు చున్నఁజూచి యారాక్షసాధిపతితో నేను హోరాహోరి పోరి పడి ప్రాణముల వీడనుంటిని. కళత్రవియోగముచేఁ గుందుచున్న నీకీవార్తఁదెల్పుటకే యింకను బ్రతికియుంటిని రామచంద్రా! (అని ప్రాణముల వీడును)

రాము—లక్ష్మణా!

లక్ష్మ—అగ్రజా! ఇదియింకను రాక్షసకృత్యమని యేనా సంశయము?

రాము—ఇంకను సంశయమా! మనతండ్రినిఁగూర్చి యీపక్షిరాజము మన కిట్టి సాయమొనర్చి తుదకు జీవముల వీడినది. ఆహా! మైత్రి యన నిట్టిదికదా! దీనినిఁజూచిన నాకింక దుఃఖముపొంగి పొరలివచ్చుచున్నది. (దగ్గరకుఁజేరి) అయ్యో! పక్షిరాజమా!

తే॥ గీ॥ దశరథుం డాప్తుఁడని మదిఁ ♦ దలఁచి, యతని
కోడలిని రాక్షసుని బారిఁ ♦ గూర్మిఁ గావఁ,
బ్రాణములవీడునందాక ♦ శ్రమసహించి,
యెట్టిమైత్రినిఁ జూపితో ♦ నిపుడు నీవు!

నీఋణము నీజన్మమునకుఁ దీర్చుకొనఁ గలుగుదునా? క్రూరుఁడగు రావణునితోఁ బోరిపోరి పక్షములఁ గోలుపోయి పడి జానకివార్త నాకుఁ దెల్పుటకు నీవిందు బ్రతికియున్నమాట వాస్తవముకదా! ప్రప్రథమమున నిన్నుఁజూచి యిదియేదియో రాక్షసకృత్యమని వృత్తాంతమరయక లోనె చంట యొకటి—రెండవది నీయమూల్యఋణము నేను తీర్చుకొనలేకపోవుట—ఈ రెండుపాపముల ఫలితము నే నిప్పుడే యనుభవించెదఁగాక! నాతండ్రికి నీవు మిత్రుఁడవు కాన నీవును నాకు తండ్రివే! దశరథుఁడు గతించునప్పుడు దగ్గర లేకపోతినని యానాఁటి నాచింత నేటితో నీ యవసానకాలమున నీప్రక్క నంతరించినది! ధన్యుఁడను. (అని దుఃఖించును.)

లక్ష్మ—(తనలో) ఈతఁడు మరల దుఃఖాబ్ధిలో మునిగినాఁడు కదా. ఎటులయిన నోదార్పవలయును. (ప్రకాశముగా) రఘుపుంగవా! జానకిని రావణుఁడు కొనిపోయినాఁడని యీపక్షిరాజము మూలమున వింటిమి. అది యిప్పుడు గతించినది. దానికై మన మిప్పు డింతగా చింతిలినఁ బ్రయోజనమేమి? శీఘ్రమే మన మిందుండి వెడలి సీతామహాదేవినిఁ గనుగొనుదము రమ్ము.

రాము—లక్ష్మణా! సీతకై యిప్పు డేమితొందర? జటాయువు మనకు తండ్రియే! గతియించెనుకాన తండ్రికి మన మిప్పుడు యథావిధి దహనక్రియల నొనర్పవలదా? ఇక్కడ నీపని పూర్తియైనపిదప సీతకై బయలుదేరుదము.

లక్ష్మ—అటులనే కానిమ్ము.

రాము—ఈ కళేబరమును జలములున్నప్రదేశమునకుఁ గొనిపోవుదము రమ్ము.

(అని యిరువురు జటాయువుకళేబరముతో నిష్క్రమింతురు.)

(తెఱ పడును.)

---

రంగము ౨.

ప్రదేశము—పంపాసరోవరము.

(రాముఁడు - లక్ష్మణుఁడు ప్రవేశింతురు.)

రాము—సౌమిత్రీ! మధ్యమధ్యమున క్రీడించుచున్నయాటంకములే లేనియెడల సీతామహాదేవిజాడల నచిరకాలములోనే గుర్తింపఁగు వారముకదా!

లక్ష్మ—రఘురామభూవరా! యిప్పుడుమాత్రమేమి? జానకిజాడలు కొన్ని తెలిసినవికదా!

రాము—లక్ష్మణా! ఈప్రాంతమునందు ఫలాదులేమియు మనకు లభింప కున్నవి కదా!

లక్ష్మ—వెదకుదము రమ్ము.

(శబరి ప్రవేశించి)

శబరి—జానకీపతీ! నేను శబరిని. నాకడ నీయెంగిలిఫలములు కలవు. వీనినే నేను మీకు భక్తిపూర్వకముగా నర్పించుకొందును. దయ యుంచి స్వీకరింపుడు.

(అని ఫలాదులిచ్చును)

రాము—(పుచ్చుకొని) శబరీ! క్షుద్బాధచేఁ దపించుచున్న మమ్ము నీవు బ్రతికించితివి. ఇప్పుడు నేను నీకుఁ బ్రత్యుపకార మేమి సేయఁ గలుగుదును?

శబరి—మహాత్మా! నాకేమికావలయును? మిముఁబోలు ధన్యుల దర్శించుటచే నాజన్మ పావనమైనది. నే నొసంగిన యీఫలాదు లను మీ రిరువురు భక్షించిన నాకదియేచాలు!

రాము—శబరీ! అటులనే! (తమ్మునివంకఁజూచి) సోదరా! యీఫల ములఁగొన్ని నీవు కూడా స్వీకరింపుము. (అని యిచ్చును)

లక్ష్మ—(పుచ్చుకొని) మహాప్రసాదము.

రాము—శబరీ! తృప్తివహించితిమి. నీకు మోక్షసామ్రాజ్యపదవి చేకూరుఁగాక!

శబరి—శ్రీరామమూర్తీ! నీకరుణయే యున్న నాకేమికొదువ?

లక్ష్మ—శబరీ! జానకీవృత్తాంతము నీ వేమేని యెఱుఁగుదువే?

శబరి—మహాభాగులారా! జానకి రావణునిచేఁ గొనిపోవఁబడుచున్న ప్పుడు తన యాభరణములన్నియుఁ దీసి మూటఁగట్టి యాఋశ్య

ముకాద్రిపైఁగల ప్లవగశేఖరులమీఁదఁ బడవైచి యేమి యో చెప్పెను. మీ రిప్పు డక్కడికేగిన యాసాధ్వీమతల్లి వృత్తాంతము సవిస్తరముగాఁ దెలియును. ఆప్లవగశేఖరులు మిమ్ము సత్కరింతురు.

రాము — శబరీ! అటులనే పోయెదము.

లక్ష్మ — అగ్రజా! దానినే రోహిణాద్రియందురు కాఁబోలు!

శబరి — అవును. అందు సుగ్రీవుఁడను ప్లవగముఖ్యుఁ డన్నయగు వాలిచే రాజ్యభ్రష్టుఁడై సేనలతోఁ గాపురము సేయుచున్న వాఁడు. మీ రాతనితోఁ సఖ్యముఁ జేసుకొన్న సీతామహాదేవి నచిరకాలములోఁ దేఁగలుగుదురు.

లక్ష్మ — అక్కడకే పోయెదము.

శబరి — మహాత్ములార! నాకు సెలవొసంగుదురే?

రాము — ఇఁక నీవుండుము.

(శబరి నిష్క్రమించును)

లక్ష్మ — రఘురామమూర్తీ! ఋశ్యమూకాద్రి యదియే కాఁబోలు!

ఉ॥ సీతను దెచ్చు కపి ♦ శేఖరుఁ డచ్చట నేఁడెసంగు, నే
మేసి హితంబుఁ గోరు మన ♦ మేఁన నాతఁడు సాయ మిచ్చు న
శ్లైప ధరాతనూజ నను ♦ రాధము బొరనిఁ గావవచ్చు, నీ
మానసమందు కోర్కె నను ♦ మానము లేక వచింపు రాఘవా!

రాము — సౌమిత్రీ! సుగ్రీవునితోఁ సఖ్యముఁ జేసుకొనుటయే మన కిప్పుడు తగినపని. ఆతని సాయముననే మనము సీతనుఁ గొని రావలయును.

లక్ష్మ — రాఘవా! ఆ వానరసేనఁ జూచితివా? కడువింతగా నున్నది.

రాము—లక్ష్మణా!

తే॥ గీ॥ జానకీదేవిమీద నా ♦ మానసంబు
వెడలుచున్న దేశాని, యే ♦ వింతఁజూడ
నొల్లకున్నది యిప్పు డీ ♦ యుర్వియందు
తలఁ పొకటి యైన వేఱొండుఁ ♦ దలఁప రెవరు.

లక్ష్మ—అది యథార్థమే! మనకడ కెవఁడో యొకవానరుఁడు వచ్చు చుండెను. అటుచూడుము!

రాము—ఎవఁడో సుగ్రీవుని పంపుననే వచ్చుచున్నవాఁడు.

(హనుమంతుఁడు ప్రవేశము)

హను—మహాత్ములారా!

రాము—సౌమిత్రీ! కోతివాని కా కుండలము లేమోయి?

హను—(ఆశ్చర్యముతో రామునికాళ్లమీదఁ బడి) మహాత్మా! మీకు నేను దాసుఁడను. మీరు సాక్షాద్విష్ణుస్వరూపులేకాని యన్యులుకారు. ఏలన?

చ॥ భువనములందు నెవ్వరికి ♦ బొత్తుగఁ గన్పడ కుండినట్టి, నా
శ్రవణయుగంబునందుఁ గల ♦ చక్కనికుండలయుగ్మ మెట్టులో,
కువలయనేత్ర! నీకనుల ♦ కున్ దగుఁ బండువుఁగాగ్న్య, నీచరి
త్రి వినఁగ నెంచినాఁడ, నిక ♦ దంబుగఁదెల్పవె నాకుఁ బ్రేముడిన్.

మ॥ హరియేకాని, మదీయకుండలయుగం ♦ బన్యుండు చూడంగ లేఁ
డరయన్ బ్రహ్మయె పల్కుచున్నది మహా ♦ త్మా! కానసీవే కదా
హరి, వాలోచనయేలయింత! యటుకా ♦ దా యేల నీకిప్డు గో
చరమాయెట్టుల! నాదుకుండలము లా ♦ శ్చర్యంబు సంధిల్లఁగన్!.

మహాభాగా! నేను సుగ్రీవునకు సేవకుఁడనగు హనుమంతుఁడను. ఇఁక నన్నింతటినుండియు మీసేవకునిగాఁ జూచుకొని రక్షింపవేఁడెదను.

రాము—వత్సా! లెమ్ము. (అని లేవదీయును)

హను—దేవా! మీవృత్తాంతము సవిస్తరముగా నేను వినఁగోరెదను సెలవొసంగుదురే?

లక్ష్మ—చెప్పెదము.

రాము—హనుమంతా!

సీ॥ దిక్తటప్రముఖ కీ ♦ ర్తివిశాలుఁడై నట్టి,
దశరథనృపున కా ♦ త్మజుఁడ నేను
రాముండ, సీతఁడు ♦ సౌమిత్రి యనుఁగు త
మ్ముఁడునాకు, తండ్రిపం ♦ పున నరణ్యా
వాసమునకు పత్ని ♦ యా సీతతో వచ్చి
నాఁడను, కూ్రరదా ♦ నవుఁ డెవండొ
కపటయత్నముఁజేసి ♦ చపలాక్షిఁగొనిపోయెఁ
గాన మెచ్చోట నీ ♦ కాననమున
తే॥ గీ॥ నిందు మీజేనితో మైత్రి ♦ నెలమిఁబూని
కూ్రర రక్కసుఁ దునుమాడి ♦ కూర్మితోడ
ధారుణీసుతఁ బడయుఁగఁ ♦ దలఁచినాము
ప్రేమఁ గొనిపొమ్ము మమ్ము సు ♦ గ్రీవుకడకు.

మాతో స్నేహ మొనరించుటకు సుగ్రీవున కేదియైన సందియ మున్నఁ దెలియఁజెప్పుము.

హను—రామచంద్రా! సుగ్రీవుఁడు మీరాకఁగాంచి యన్నయగు వాలిపంపున తనను వధించుటకు వచ్చుచున్నభటు లేమో యని తలంచి యిప్పుడు మధువనమున దాగియున్నవాఁడు. మిమ్ముల నెను వెంటఁగొనిపోయి యీవృత్తాంత మంతయుఁజెప్పిననాతఁడు మీకు దాసుఁడగును. సీతామహాదేవి నచిరకాలములోఁ దీసికొనివచ్చి మీ కర్పింపఁగలఁడు. అతనికడకుఁ బోవుదము రండు.

లక్ష్మ—హనుమంతా! జానకీదేవి జాడంబు మీకేమేని తెలియునే?

రాము — తెలియక పోవునా?

హను—దేవా! దైత్యాధముం డొక్కండు విమానముమీంద నొక కాంతాలలామ నిడుకొని గగనవీధినిం బోవుచుండ మేమందఱము చూచితిమి. బల్మినిం గొనిపోవంబడుచున్న యాసాధ్వీమణి యార్తనాదముచే మాయందఱి హృదయములు కఱఁగినవి.

చం॥ వడివడిబోవుచుండఁగ న ♦ భంబున దైత్యవిభుండు, మేనిపైం
దొడవుల మూటఁగట్టి పడఁ ♦ ద్రోసెను మాపయి నాలతాంగి, యు
ప్పుడె కపిరాజు దానిఁగొని ♦ పోయెను భద్రముఁ జేసియుంచె, నా
తొడవులఁజూచి యెవ్వరొకొ ♦ తోయలి చెప్పఁగలేవె? రాఘవా!

ఆ పతివ్రతాలలామయే జానకీదేవియై యుండనోవు! ఆ దానవాధముండు దక్షిణాభిముఖుండై పోయెను. మే మెఱిఁగిన వృత్తాంతమింతియే!

లక్ష్మ—అగ్రజా! అనుమానమేల? ఆమెయే సీతాదేవి. ఆ దైత్యాధముండే రావణుండు.

రాము—అటులైన సుగ్రీవునికడకుఁబోయి యాతనితో సఖ్యముఁ జేసికొని సీతాదేవినిం గొనివచ్చుటకుం దగుప్రయత్నములఁ జేయుదము రమ్మా.

హను—మహాత్ములారా! విచ్చేయుండు.

(అందరు నిష్క్రమింతురు.)

[తెఱపడును.]

## రంగము 3

ప్రదేశము—ఋష్యమూకాద్రి.

(సుగ్రీవుఁడు—హనుమంతుఁడు—రాముఁడు—లక్ష్మణుఁడు
వానరసేన ప్రవేశింతురు.)

సుగ్రీ—శ్రీరామచంద్రుఁడు నాఅన్నయగు వాలి నవలీలఁ ద్రుంపఁగలఁ
డను ధైర్యము నా కిప్పటికి కలిగినది.

హను—రామమూర్తిని జయించువారలు కలరే?

రాము—సుగ్రీవా! నీఅన్నయగు వాలిని జయించి కిష్కింధాపురపట్టణ
ము నీకుఁ గట్టుభారము నాయది. అంతటినుండి నీవు మేము
జానకినిఁ గొనితెచ్చునంతవఱకు సాయముఁ జేయుచుండవల
యును.

లక్ష్మ—అగ్నిసాక్షిగ సఖ్యముఁ జేసికొన్నప్పుడు మాటతప్పుదు రే?

సుగ్రీ—రాఘవా!

తే॥ గీ॥ కులగిరులు భూమిఁ గ్రుంగిపోవుఁగాక ♦ గుర్వి విఱుఁగాక!
యెల్లజలనిధు లింతట ♦ సింకుఁగాక!
భాస్కరుఁడు నిజగతి నెడ ♦ బాయుఁగాక!
అనృత మందునే నీతోడ ♦ ననఘ! నేను?

లక్ష్మ—కిష్కింధాపురాధిపత్యము చేఁబడిన మమ్ముల మఱతువేమో
యని—సుగ్రీవా! యిది లోకసహజముకదా!

హను—మాట యని తప్పు టధర్మముకదా!

రాము—అవును.

లక్ష్మ—ఇటుల మనము జాగుజేసినఁ బ్రియోజనమేమి? వాలిసం హారమునకుఁ బయన మెప్పుడు ?

సుగ్రీ—ఎప్పుడో నా? వెళ్ళుదము.

హను—శ్రీరామచంద్రా! నీవు మనుష్యమాత్రుఁడవా? దుష్టుల శిక్షించి శిష్టుల రక్షించుటకీ యవతార మెత్తిన శ్రీమహావిష్ణువు నీవె కావా? చతుస్సముద్రముద్రితంబైన యీబ్రహ్మాండ మంతయు నీయందు లేదా ? నీయవక్రపరాక్రమసంపన్నత, నీయనుపమేయ శస్త్రాస్త్రవిద్యాప్రవీణత, నీయోగ్యత, నీధీకుశలత, నీపరోపకారపారీణత, నీనిజసాహసశౌర్యధైర్యములు, నీవిష యమ్ము సమస్తమెఱిఁగిన వాలి నీకు దాసుఁడు కాఁడే? సీతా మహాదేవిని వెదకుటకు నీవెంట రాఁడే ? రావణుఁడైననేమి నీకు పాదాక్రాంతుఁడు కాఁడే ? రఘువరా! సర్వము నీవె కావే? దశరథభూపాలుని పూర్వపుణ్యవశమున మానవమానుషవిగ్రహుఁడవై యాతనిగర్భమున జన్మించి రఘుకులమును పవిత్రము నుచేసి లోకమునుద్ధరింపవచ్చిన యవతారమూర్తివి. మహాత్మ్ముండవు—నిర్గర్వుండవు—నీమహిమంబులు మాబోంట్లు వర్ణింపఁగలరే? రఘురామస్వామీ !

సీ॥ శ్రీమహాలక్ష్మి యా ♦ సీతామహాదేవి,
కేవల విష్ణుండ ♦ వీవెయైన
నాదిశేషుఁడు సుమి ♦ తాసుతుండై, కుడి
భుజముగ నీకెప్డు ♦ ముద మొసంగ
శంఖచక్రంబులు ♦ జగతిపై శత్రుఘ్న
భరతులై ముల్లోక ♦ వంద్యులైన
విబుధ సంఘంబులు ♦ ప్లవగగణంబులై
సంతతమ్మును నీకు ♦ సాయమీయ

తే॥ గీ॥ దుష్టులను జెండి, శిష్టులఁ ◆ దొడరి కావ
వచ్చియున్నావు నీవిప్డు ◆ ప్రమద మలర
ఎలమి నీమహిమంబు నే ◆ నెన్నఁగలనె?
వీరరాఘవా! నిన్మది ◆ వేఁడుకొందు॥

(అని కాళ్లమీఁదఁ బడును.)

రాము:—ఆంజనేయా! లెమ్ము. (అని లేవఁదీయును.)

సుగ్రీ—రఘువంశోత్తమా! పతివ్రతామతల్లియగు సీతామహాదేవిని రావణాసురుఁడు కొనిపోయి యెచ్చట దాచిపెట్టిన నచిరకాలములో నీ కాసాధ్వీమణిని తెచ్చి యర్పింపఁగలను.

రాము—సుగ్రీవా! నీ కిష్కింధాపురపట్టము మేము కట్టెదము. వేగిరమె సింహద్వారముకడ కేగి శంఖముఁ బూరింపుము.

సుగ్రీ—రాఘవా! నాయన్నయగు వాలిప్రతాపము నీకుఁ దెల్పితిని గదా! అతని యెదుట నిల్చి యెవ్వఁడును పోరాడఁ జాలఁడు. ఏలన, ఎదుట నిల్చి పోరాడువాని బలములో సగము బలమాతనికి లభించునటుల వరమొందున్నది. కాన నీవే వృక్షము చాటుననుండియైన నాతని సంహరింపవలయును.

రాము—అటులనే చేసెదను.

లక్ష్మ—ముందు నీవుపోయి శంఖనాదము చేయుము. మేము కూడ వచ్చెదము.

సుగ్రీ—పోవుదును. (అని యందఱు నిష్క్రమింతురు.)

[ తెఱపడును ]



శ్రీ

# శ్రీ రామపట్టాభిషేకము

—:o:—

## తృతీయాంకము

### రంగము 1

(ప్రదేశము కిష్కింధాపుర బాహ్యమందలి యుద్ధభూమి. వాలిపడియుండ, సుగ్రీవుడు—హనుమంతుఁడు— రాముఁడు—లక్ష్మణుఁడు ప్రవేశింతురు)

సుగ్రీ—శ్రీరామచంద్రా! వాలిసంహారమైనది కదా!

వాలి—ఇఁక నీకుఁ గిష్కింధాపురపట్టము గట్టవలయును.

హను—నీదేవియగు తారపల్కులనాలకించి నీవు కూడ రాఘవుని తో సఖ్యము చేసుకొన్న పక్షమున నిట్టి హైన్యస్థితి రాకయుండు నంకదా!

రాము—తారేశ్వరా! నీవు నిసోదరునకు ద్రోహ మొనర్చిన వాఁడవు.

వాలి—(కోపముతో) చాలు! చాలు! ఇక నూరకుండుము.

ఉ॥ రాజకులంబునందు రఘు ♦ రామనృపాల! జనించినావు నీ
తేజముఁజూపి వ స్తదిసి ♦ ధీరతఁబోరుట చెల్లుఁగాని యి
ట్లా జగడంబుసల్పుట? మ ♦ హాత్ములకిట్టివె ధర్మయుద్ధముల్?
భూజముఁజాటుచేసికొని ♦ పోరతి వెంతటివాఁడవోకదా!

చ॥ సమరము జేసి వాలిఁగల ♦ శక్తిఁగ నుంగొన ప్రీతి యొప్ప నట్
గ్రముముగఁ బిల్వ రాదె రఘు ♦ రాజ సృపాగ్రణి! భీతి యేమి యా
శ్రుతఁబడ నేల పాదపము ♦ చాటున డాగి ఘనంబె నీకుఁ? గూ
రిమి జగముల్ నుతించునె? త ♦ రించునె జన్మము? క్షాత్రశౌర్యమే?

ఉ॥ నన్ను వధించినందున మ ♦ నంబున సుంతయుఁ జింత లేక, యి
ట్టెన్ని యఘంబులుండెనొ మ ♦ హీతలమందున నీకు చూడు, నా
కన్న కుమారుడుం సతియుఁ ♦ గానల పాలయిపోదురే కదా!
పున్నెమె నా దుతమ్మునకు ♦ పొల్పుగఁ బట్టముఁగట్ట నీ కిటన్.

ఉ॥ రావణుఁ గూల్చి సీతఁగొని ♦ రాగ మనంబున నెంచి నీవు సు
గ్రీవుని పక్షమేర్పడ భ ♦ రించి వధించితి, వట్లు కాక, నీ
భావము నన్నె నాతోఁ దెల్ప ♦ పక్షశ్రమ లేమియు లేక నా పనున్
భూవర! వేగ, నశ్వతరి ♦ వోలె, దశాననుఁ గొట్టి తేనొకో!

ఉ॥ సీతను గూర్చి విగ్రహముఁ ♦ జేయుట తప్పదు పంక్తికంఠుతో
నీతటి నీకు, కష్టతర ♦ మీ పని వార్ధిని దాటఁగా వలెన్
గోతుల నండఁ జేసికొని ♦ కూల్చెద వే యట దైత్యులందఱిన్
భూతలనాథ! రావణుని ♦ ముంచినవాఁడను నేను వార్ధులన్.

అసమర్థుఁడగు సుగ్రీవునితో మైత్రి సల్పి నిష్కారణముగా నధర్మయుద్ధ మొనరించి నన్ను సంహరించితివి కాని, దశరథనందనా! నాతో నీవు సఖ్యముఁ జేసికొన్న పక్షమున నెట్టిశ్రమయు లేక యా లంకారాజ్యముతో నొక్క త్రుటికాలములోఁ బెకలించుకొనివచ్చి నీ యెదుట పెట్టెడువాఁడను కదా! విశ్వకర్మ నిర్మితమైన యా లంకాపురము శత్రుకోటి కభేద్యమైనది. రావణుని యాజ్ఞ లేనిదే యొక్క చీమకైన నాపురములోనికిఁ జొరంబడ నలవికాదు. శతయోజనవిస్తీర్ణమైన యా సముద్రమును లంఘించి యీ కోతిమూకతో నీ వా దైత్యుల సంహరించుటెట్లు? ఈ సుగ్రీవుఁడు సాయ మొనరించుటెట్లు? దశాననుఁడు నిర్వక్రి

పరాక్రమసంపన్నుఁడు. లోకములన్నియు జయించినవాఁడు. అతని మించినవాఁడు కుంభకర్ణుఁడు. రావణుని పుత్త్రుఁడగు నింద్రజిత్తు మనుష్యమాత్రునకు వశ్యుఁడుకాఁడు. ఇంక నా రావణుని కిట్టివీరు లెందరో కలరు. మీఁదుమిక్కిలి రాత్రించరులు మాయాయుద్ధము లందు నిపుణులు. శ్రీరామచంద్రా! రావణుఁడు సామాన్యునిచే జయింపఁబడునే? దశవదనుని కెంతశూరత్వము కలదో యంతభక్తియు గలదు. అట్టి లంకాధిపతిని నేను నావాలమునఁ జుట్టుకొని యెల్లజల నిధులందును ముంచితిని. నన్నెదిరించి పోరాడువార లెవ్వరుకలరు? తెరువుచాటున నిలువఁబడి నాకుఁదెలియకుండ నధర్మయుద్ధ మొనరించి నన్ను సంహరించితివి కాని, నాయెదుటనే నిలువఁబడి ధర్మయుద్ధ మొన రించిన నీ పరాక్రమము కన్పడదే? ఎట్టి యమానుషకృత్య మునరిం చితివి? ఇంతయేల? ప్రప్రథమముననే నీవు నాసాయ మపేక్షించిన సీతాదేవిని వాడనివుప్పమాలవలెఁ దెచ్చి నీయెదుటఁబెట్టనే? నీకు ఉప చారములు సేయనే? రాఘవా! రాఘవా!

(అని యూరకుండును)

లక్ష్మ—తారేశ్వరా! తమ్ముఁడగు సుగ్రీవుని ద్రోహముచేయుట నీ కంత యధర్మముగా లేదుగాని చెట్టుచాటున నుండి శ్రీరామ చంద్రుఁడు నిన్ను సంహరించుట యధర్మమాయెనుగా!

రాము—లక్ష్మణా! నీవూరకుండుము.

హను—కపిరాజా! రాఘవేశ్వరుఁ డవతారపూరుషుఁడు. అట్టి మహా త్ముని చేతిలో మరణించెడు నీ వింకను దుఃఖ మొందెద వేమిటికి? ధన్యుఁడవు.

(తార, అంగదుఁడు దుఃఖముతో ప్రవేశింతురు)

తార—(వాలినిఁ జూచి) హా! నాథా! నాథ! ఇది నీకడసారిప్రేము డియా? ఆహవకేళిని మీ కిట్లు మరణమున్న దని కలనైనఁదలఁప

నైతినికదా! దిగంతయశోవిశాలురై అనుపమేయబలసాహస
శౌర్య ధైర్యమూర్తులై తుద కిట్లు మరణించుచుంటిరా?
సహృదయముగ—సావకాశముగ—సానురాగముగ నింక మీ
రెప్పుడు నాతోఁ బల్కెదుగు? మీయస్తమాన ముఖచంద్రి
చంద్రికారుచులు, మీ తేజోవిహీనలోచనావపానవీక్షణములు
నాహృదయమును దుఃఖపరిపూరితమును చేయుచున్నవి.
ప్రాణేశ్వరా! మీకడసారి పలుకులఁ జెప్పుఁడు. అవతారపూరు
షుఁడగు రాఘవేశ్వరునితో మీ కని వలదన్న నామాటవింటిరే?
జీవితేశ్వరా! యీ మీముద్దుల తనయునైన నొకసారి కనులెత్తి
చూడుఁడు! అయ్యో! యీ కిష్కింధాపురరాజ్యలక్ష్మి కప్పుడే
వైధవ్యము సంప్రాప్తించునా! మనోహరా! మనోహరా!—
(రామునిఁజూచి) రాఘవా! అధర్మముజయింప—అన్యాయము
సంహరింప—అరాజక మడంప—అవతార మెత్తినవాడవై
యుండి యింత యకృత్యమునకుఁ బాల్పడితివేమి? సర్వ మెఱిం
గియు మహాత్మా! యిట్లు చేసితివేమి? నాపొంగు నెంతలోఁ
గృంగఁజేసితివి? అయ్యో! యీ యనుఁగుఁ బుత్రుకునిఁ జూచి
యైనను నీవు మాయందు జాలివహింపవైతివే? నీ కరుణాపరత్వ
మేది? నీసాధుత్వ మెక్కడ? శ్రీరామచంద్రా! సీత నపహరించు
కొనిపోయిన రావణాసురుఁడు నీకు శత్రుఁడుకాని యాతని
వాలమునఁ జుట్టుకొని యున్ని సముద్రముల ముంచి లేవ నెత్తిన
నాభర్త నీ కేమి వైరి? మఱల సుగ్రీవుఁ డెట్టి చుట్టము? నిర్దో
షముగ—నిశ్చింతగ—నిష్కారణముగ— నిర్దయుఁడవై
నామగని వధించి మమ్ముల నింత ఘోష పెట్టిన యీ పాపము
నిన్నూరక విడుచునే! భక్తజనులఁ బోషణజేయువాడవఁటకదా!
పరమదయాళుఁడ వఁటకదా! నీభక్తజనపోషణ—నీపరమ
దయాళుత్వ మెం దణఁగినది? రాఘవేంద్రా! నాజన్మ మెంతలో
నిరర్థకముఁ జేసితివి? నాపిల్లవాని నెంత దురదృష్టవంతునిగఁ

జేసితివి? అయ్యో! నా కింకేమిగతి? రఘురామచంద్రా! రఘు
రామచంద్రా! (అని యూరకుండును)

అంగ—(దుఃఖముతో) హా! జనకా! జనకా!

ఉ॥ కన్నదినంబునుండి యతి ♦ గారవమొప్పగఁ బెంచినావు, నా
కన్న మఱెవ్వరిందు జన ♦ కా! ప్రియమిచ్చెడు వారు నీకు? నీ
చిన్నికుమారుఁడన్ గనుము ♦ శీఘ్రమె నన్నికఁ గన్నులెత్తి, యిం
కెన్నఁడు చూచువారము మ ♦ హీస్థలి మిమ్ముల నిప్పుడే కదా!

కం॥ నీకడసారిపలుకు,ని
ప్డీ కొమరునితోడ చెప్ప ♦ వేటికి? తండ్రీ!
నీ కైకుందెడు సతిపైఁ
బ్రాకటముగ నిల్పుమింక ♦ పవిమలదృష్టిన్.

తండ్రీ! ఆయాస మధికమగుచున్నది కాఁబోలు! మాటలాడఁ
జాలవా? ఈదురదృష్టవంతునకు—యీనిర్భాగ్యునకు—నీయవసాన
కాలపుఁ బలుకులు విను భాగ్యముకూడ లేదుకాఁబోలు! అయ్యో!
తండ్రీ! నిన్ను సంహరించుటకే యీ శ్రీరామావతారము వచ్చినది
కాఁబోలు! లేనియెడల నీవు మానవమాత్రునకు సాధ్యుఁడవె?

(అని యూరకుండును)

లక్ష్మ—యువరాజా! నీకుఁగూడ యిదియేమి వెఱ్ఱియోయి? శూరుఁడ
వని పేరుచెందిన ధీరమూర్తివి నీవుకూడ యబలలకంటె
నెక్కుడుగ వీరస్వర్గారోహుఁడుకానున్న తండ్రికై యిటుల విల
పింపఁదగునే? ఊరడిల్లుము.

వాలి—(హీనస్వరముతో)

రఘురామచంద్రా! నాకదసారికోరిక.........నాబాధ—నామరణమునుగూర్చి నాకంతవిచారములేదు కాని.........అఱచేతులలో నల్లారుముద్దుగ పెంచుకొనినవాఁడను—ఎప్పటికైన రాజ్యాభిషిక్తుఁడై యీకిష్కింధాపురము పరిపాలించుచుండఁ జూచి సంతసింపవలసినవాఁడను—"అంగదా! రారా" యని పిలిచి నా ముద్దుముచ్చటలన్నియు నింక తీర్చుకొనవలసినవాఁడను—నా కాభాగ్య మింక లేకపోయెనని విచారించుచుంటిని. రాఘవేశ్వరా! అట్టి యంగదుని భారమంతయు నీపైనఁ బెట్టుచుంటిని. ఈ సుగ్రీవుని బారిఁబడకుండిన రాజ్యము లేకపోయినను, భోగ్యతాదశ యంతరించినను, బ్రతుకఁగలఁడు. సుగ్రీవునిపై నీకుఁ గల వాత్సల్యవిశేషముచేతఁగాని, యాతఁడు నీ కొనరింపనున్న యపూర్వసాయముఁగూర్చికాని నాయనుఁగు తనయుఁడగు నంగదునిమాత్రము మఱువవలదు. రాఘవా! అంగదుఁడు దిక్కులేనివాఁడైనాడు. వానిని నీచేతులలోఁ బెట్టుచుంటిని. ఎప్పటికిని మఱువవలదుసుమా! (అంగదునిచూచి) కుమార!.........అన్నిటికిని రాముఁడే కలడు. (తారనుచూచి) దేవీ!......దేవీ!...రాముఁడే...కలడు...రాముఁడు...రాముడు(అని యూరకుండును.)

తార—(దుఃఖముతో) హా! జీవితేశ్వరా! జీవితేశ్వరా!

అంగ—(దుఃఖముతో) జనకా!—మరణించితివా!

లక్ష్మ—అంగదా! నీవిప్పుడు నీతల్లిని యోదార్పవలసినవాడవోయి!

రాము—(తారనుచూచి) పతివ్రతాశిరోమణీ! ఇంతగా విలపించుటేల? నీనాథుఁడు నిజసోదరునకు ద్రోహముచేసినవాఁడైనను నాచేతిలో మరణించెను. కాన యెట్టివార లందరాని పరమపదంబుఁ బొందును. నీతనయుఁడగు అంగదుని భారమంతయు నింక నాపైనున్నది. ఊరడిల్లుము.

తార—(దుఃఖముతో) శ్రీరామ! నీకాపాటిదయయైన నాజీవితేశునిపై గలిగినదా?

హను:—అవతారపూరుషుని చేతిలో మరణ మెంతటి ధన్యునకు కలుగును? అదియట్లుండ రాఘవేంద్రుఁడు నీనాథునిపైఁగల ప్రీమాతిశయములచే నాతనికి పరమపదంబు లభించునటుల వరమిచ్చియున్నవాడు. సాధ్వీమతల్లీ! యింక నీజీవితేశ్వరుని విషయమై నీవు విచారింపవలదు. ఊరడిల్లుము.(అని అంగదునిజూచి) అంగదా!

రాము—సుగ్రీవా! నీ వంగదుని చేరదీసి యోదార్పుము. వాలికి దహనక్రియాదు లాతఁడే జరుపవలయునుకదా!

సుగ్రీ—కుమార! అంగదా! రమ్ము, చింతింపవలదు. ఉత్తమపదంబుఁ బొందిన జనకునిఁగూర్చి విచారింపకుము. అతనికి జరుపవలసిన దహనక్రియాదులకు సంసిద్ధుఁడవు కమ్ము, లెమ్ము.

లక్ష్మ—అగ్రజా! యీ యాలస్యమెందులకు?

హను—ముందు జరుగవలసిన పని చాలయున్నది.

రాము—ఆ ప్రయత్నముమీదనే యిక మన ముండవలయును. వెళ్ళుదము.

(అందరు నిష్క్రమింతురు.)

[తెరపడును]

---

రంగము 2

ప్రదేశము—ఋష్యమూకాద్రి

(రాముఁడు—లక్ష్మణుఁడు ప్రవేశింతురు)

రాము:—సౌమిత్రీ! కిష్కింధాపురాధిపత్యము వహించినపిమ్మట సుగ్రీవుఁడు మనవిషయమై బొత్తుగా మఱచిపోయినవాడుకదా!

లక్ష్మ—ఆతని కార్యసాఫల్యమైన పిమ్మట" ఇంక మనకు రామలక్ష్మణులతోఁ బనియేమి? వారలఁగూర్చి వృథాశ్రమ నే నేలపడవలయు" ననిపెడగా నున్నవాడు. ఆకోతివానిని నమ్ముకొనిమన ప్రయత్నమున కంతరాయ మేర్పఱచుకుంటిమి. ఇంక నా సుగ్రీవుఁడు మనకు సాయమొనరించునా?

రాము—అటులయినఁ బ్రతిజ్ఞాభంగము కాదా?

లక్ష్మ—కోతివానికి ప్రతిజ్ఞయేమి? ప్రతిజ్ఞాభంగ మేమి?

రాము—లక్ష్మణా! సుగ్రీవుఁడు సద్గుణసంపన్నుఁడే!—

లక్ష్మ—ఇంకను నీవాతనినే నమ్మెద వేమిటికి?

రాము—కిష్కింధా పురాధిపత్యము వహించునప్పుడు సుగ్రీవుఁడు, మన ప్రయత్నము విషయమై యాతని యడుగగా వర్షఋతువు వెళ్లినపిమ్మట "సీతజాడల నరయుద"మని వాగ్దానము చేసి యున్నవాడు.

లక్ష్మ—అప్పు డాతనికి యటులచేయకఁ దప్పినదికాదు.

రాము—ఆ కీశాధిపతి యిప్పుడు మనలను బొత్తుగా మఱచియున్న వాఁడు.

లక్ష్మ—నేను కిష్కింధాపుర మేగి సుగ్రీవుని యీవిషయమై హెచ్చరించెదను.

రాము—అటులనే ఆంజనేయాంగదాది వీరులతోఁగూడఁ బ్రసంగించి సుగ్రీవునితో మాటలాడుము.

లక్ష్మ—ఇప్పుడే పోయెదను.

(అని నిష్క్రమించును)

రాము—తలంచుకొనుచున్న గుండె బ్రద్దలగుచున్నదికదా! ఎన్నఁడేని నే నిట్టి యగచాట్లపాలగుదునని తలఁచితినే? కర్ణకఠోరమగు

యీవార్త భరతశత్రుఘ్నులకుఁ తల్లులకు, గురువరేణ్యులగు వసిష్ఠభగవానునకు, అయోధ్యాపౌరులకు, జనకునకుఁగాని, మిధిలాపౌరులకుఁగాని తెలిసిన వారలు బ్రతుకుదురే? నన్నెంత నిందింతురు! నేనెట్టి యపకీర్తిపాలగుదును? ఎట్టిదుర్దినములు సంప్రాప్తమైనవి? మనోహరీ! జానకీ! ఇంక నిన్నెన్నడు చూడఁగలుగుదును? నిర్భాగ్యుఁడు—నింద్యుఁడు—నిష్ప్రయోజకుఁడగు యీ రాముని యేమిసౌఖ్య మనుభవించుటకుఁ గట్టుకొంటివి? పత్నికష్టసుఖములఁ బరిపాటిఁ బాటింపలేని నాకంటె యధముఁడు వేఱొక్కఁడుండునే? హా! సీతా! సీతా! ఎక్కడనుందువు? రక్కసుని బారిఁబడి యింక నీరాముఁడువచ్చి రక్షించునని బ్రతికియుంటివే? బలవన్మరణ మొందియుంటివా? నారీశిరోమణి!

శా॥ "నానాథుం డరుదేరి యెప్పటికినై నన్నన్ను రక్షింపఁడే
యీ నీచాధముఁగూల్చి" యంచు మదినెం తేనిన్ విచారింపకే
దీనత్వంబును బాసియుండునెడ నీ నిర్భాగ్యుఁ డేరీతి ని
న్నో నారీమణి! ప్రోవఁగా గలడొకో? యూహింపవే నెమ్మదిన్.

ఉ॥ క్రూరుని బారిచిక్కి, గడుఁ గుందుచు భీతత లంకలోన, నా
కై రమణీ! మఱెంతశ్రమఁ గాంచుచునుంటివొ? యేమిసేతు? నా
ఘోరనిశాచరాధములు కూర్చెడి బాధల సైపుచుంటివే?
తీరనిదుఃఖ మేర్పడె స తీ! దురదృష్టుల కేమి శ్రేయముల్?

అదృష్టవంతునకు, దైవమనుకూలించువానికి కదా భూలోకమున శాశ్వతసుఖము! ప్రతివారి కబ్బునే? ఈదుఃఖముతోఁ బ్రయోజనమేమి? శ్రమవహించి యాప్లవఁగసేనలఁగూడి తన్వి!నీజాడ లరయుటకై చనుదేరిన యెప్పటికైన మంచిరోజులు రాకపోవునే? ఇంత కథాక్రమమిందు జరుగవలసియున్నది కావుననే కైకేయి యాదశరథభూపాలుని నాకుఁ బదునాలుగేండ్లు వనవాసము, భరతునకు పట్టాభిషేకము కోరి

నది. అతల్లిని నేను నిందించుట మహాదోషముకాని వేఱుకాదు. నా కర్మఫలము ననుభవించుటకుఁగదా నేనుజన్మించితిని! అనుభవింపక తప్పునే? ఇప్పుడు నాకీమాటలేల? ప్రతిజ్ఞాభంగముఁ గావింపక సుగ్రీవుఁడు సాయమొనరించిన జానకీ! ని న్నిక నచిరకాలములో నేను కాపాడఁగల నను ధైర్యము నాకు పొడముచున్నది. ఆ కిష్కింధాధీశ్వరుఁ డమానుషకృత్యమునకుఁ బాల్పడునే? బాల్పడిన మాత్రమున నేమి? నీజాడల నరయ లేనా? ని న్నాదానవాధముని బారినుండి రక్షింపలేనా? కానిమ్ము.

(అని లోపలకుఁబోవును)

(తెఱపడును)

---

రంగము ౩

ప్రవేశము—మధువనము

(రాముఁడు, లక్ష్మణుఁడు, సుగ్రీవుఁడు, అంగదుఁడు, హనుమంతుఁడు, జాంబవంతుఁడు, వానర సేన ప్రవేశింతురు)

రాము—కపిశేఖరా! మన ప్రయత్నమునుగూర్చి యింకను జాగుఁజేసెద వెందులకు?

లక్ష్మ—(కోపముతో) నీ స్వాంతమునందు కలదేమిటో వెల్లడింపుము. అంతగాఁ బ్రతిజ్ఞాభంగము గావింతువేని మాతోడ్పడను మేము పోయెదము. ఈ యాలస్యమేమి?

సుగ్రీ—మహాత్ములారా! కినుక వహింపవలదు. సీతామహాదేవిని వెదకి తీసుకొనివచ్చి మీ కర్పించు భారము కొంతవఱకు నాదియే! ప్రతిజ్ఞాభంగముఁ గావింతునా? ఆ సాధ్వీలలామ జాడల నరయుటకై నేడే యన్నిదిక్కుల కందఱిని పంపెదను. జానకీదేవి వృత్తాంతముఁ గనుఁగొను నంతవఱకు నాకు వేఱొండు పని యేమున్నది?

అంగ }
హను } ఇంక జాగేందులకు ప్లవంగాధిపా! అన్నిదిక్కుల కందఱిని
జాంబ } పంపిన యాసాధ్వీమణి వృత్తాంతము మన కచిర కాలము
లోఁ దెలియును.

సుగ్రీ—(వానర సేనఁజూచి) వానర యోధులారా! మీరందరు నా యాజ్ఞప్రకార మన్నిదిక్కుల కరిగి సీతాదేవి జాడల నరసికొని రావలయును. (వినతునిఁజూచి) వినతా! కొంత సైన్యమును నీవు తీసుకొని తూర్పుదిక్కునకుఁ బొమ్ము.

విన—చిత్తము అటులనే!

సుగ్రీ—మారుతీ! అంగద, జాంబవదాది వీరులతో నీవు దక్షిణదిక్కున కరుగుము.

హను }
అంగ } —కపిరాజా! అటులనే పోయెదము.
జాంబ }

సుగ్రీ—సుషేణా! కొంత బలగముతో నీవు పడమరదిశాభిముఖుఁడవై పొమ్ము.

సుషే—దేవరయాజ్ఞ మౌళి నిడుకొని పోయెదను.

సుగ్రీ—శతబలీ! నీవు కొంత పరివారముతో నుత్తరదిశఁ బరికించిరమ్ము.

శత—మహా ప్రసాదము.

సుగ్రీ—వానర యోధులారా! యీ దినము మొదలుకొని నెల దినములలోపుగా మీరు జానకీదేవి జాడల నరసికొని రాకపోదురేని మీకు మరణదండన విధియించెదను. ఇదియే నాకఠిన శాసనము. (రామునిఁజూచి) రామచంద్రా! జానకీదేవి జాడల నరయుటకై యిఁక నెలదినములు మాత్రము గడువిమ్ము.

రాము—అటులనే కానిమ్ము. (హనుమంతునిఁజూచి) అంజనేయా! యెప్పటికైన జానకీదేవినిఁ గనుఁగొనువాఁడవు నీవే! నీ శక్తి

సామర్థ్యము లత్యద్భుతములు. సీతను గనుఁగొనిన, నిన్ను శ్రీరామదూతవని యాసాధ్వి నమ్ముటకుఁగాను నా యీ ముద్రిక గుర్తుగాఁ గైకొనిపొమ్ము. (అని ముద్రిక నొసంగును)

హను—(తీసికొని) మహాప్రసాదము! (కనులకద్దుకొనును).

రాము—(దుఃఖముతో) వైదేహి కది యొసంగుము.

హను—రాఘవేంద్రా! మీ కరుణయేయున్న సీతాదేవి నచిరకాలములోఁ గనుఁగొని రాఁగలందునే?

లక్ష్మ—కపిరాజా! మనముకూడ నేదెసకైనఁ బోయి సీతాదేవి వృత్తాంత మరయవలదా?

సుగ్రీ—లక్ష్మణా! మనమెందులకు? పోయెడువారెవ్వరు కనుఁగొనఁజాలక పోయినపిమ్మట మనము బయలుదేరుదము.

రాము—ఈ నెలదినములుకూడ మేముపోయి ఋష్యమూకాద్రిపై నుండెదము.

సుగ్రీ—రాఘవా! వనవాసదీక్షచే నీవు కిష్కింధకు రాకపోయిన లక్ష్మణుఁడైన నేల పురీవాససౌఖ్య మనుభవింపరాదు?

లక్ష్మ—కపిరాజా! శ్రీరామమూర్తి సేవయే లేకున్న నాకు పురీవాససౌఖ్యము లేల? నాయగ్రజుని బాసి నేనుండఁగలనా?

సుగ్రీ— అటులైన నేసింకఁ జెప్పునది యేమున్నది?

రాము—ఇఁకఁ బోవుదమురండు.

(అని యందఱు నిష్క్రమింతురు)

(తెఱపడును)



శ్రీరస్తు.

# శ్రీరామపట్టాభిషేకము

—o—

## చతుర్థాంకము

### రంగము ౧.

ప్రదేశము—కిష్కింధాపుర రాజసౌధము.

(సుగ్రీవుఁ డాలోచనాపరుఁడై ప్రవేశించును)

"నెలదినముల గడువులోపల జానకీదేవి వృత్తాంతముఁ దెలిసికొని రానియెడల మరణదండన విధియించెద" నని చెప్పి నలుదెసలకు వానరవీరులఁ బంపియుంటిని. దక్షిణదిశాభిముఖులై పోయిన హనుమదంగదాదివీరులు తప్ప తక్కినవారలందఱు ఆసాధ్వీమణిఁ గనుఁగొనఁజాలక వచ్చియుండిరి. ఆ యోధు లింక నేల రాకుండిరో కదా?—

చం॥ గడువుదినంబువచ్చె, నిఁకఁ ♦ గారణమేమయి యుండవచ్చు? నే
యిడుములఁ జిక్కినారొ? ధర ♦ ణీస్థలి రారుకదా కపీంద్రు, లా
పుడమిజ జాడ లారయక ♦ పోయిన నందఱిఁబోలె రారొకో
పొడఁగనినారొ జానకిని? ♦ పోరుచునుండిరొ దానవాళితోన్॥

నలుదెసలకుఁ బోయిన వానరులలో నిట్టిసమర్థత కలవారలును, కార్యసాఫల్య మెప్పటికైనఁ గావించుకొని రాఁగలిగినవార లా హనుమదంగదాది వీరులే! వార లింత తడవుచేయుటకుఁ గారణముండక

పోదు. ఎప్పటికైన సీతాదేవి జాడల నరసికొని వచ్చు సమర్థుఁడు హనుమంతుఁ డేయని తలంచికదా శ్రీ రాఘవేశ్వరుం డాతనికే తన ముద్రిక నొసంగి యున్నవాఁడు. కార్యసాఫల్యముఁ జేసుకొనిగాని మారుతి రాఁజాలఁడు. కానిమ్ము. (అని నిష్క్రమించును)

(తెఱ పడును)

---

రంగము ౨.

ప్రదేశము - కొండగుహ.

(హనుమంతుఁడు - అంగదుఁడు - జాంబవంతుఁడు మున్నగువారలు ప్రవేశింతురు.)

హను—యువరాజా! అంతయు మోసముగా నున్నదే!

అంగ—మార్గ మెటులో తెలియకున్నది. ఫలాదులేమియును లేవు. క్షుద్బాధ తీవ్రముగా నున్నది. ఏమిసేయుదము?

జాంబ—ఇదియేమైన రాక్షసకృత్యమా?

అంగ—రాక్షస కృత్యములుకాడ నిటులనే యుండునుకదా!

హను—ఇంతలి వృత్తాంతము నంతయు సవిస్తరముగా నరయక మునుపే మన మన్యథాతలఁపనేల?

జాంబ—ఇందేమి వృత్తాంతమున్నది? ఉన్నమాత్రము మనల నాదరించి యిప్పుడు చెప్పువార లిందెవ్వరు?

హను—ఎవ్వరుండకపోదురా! బాగుగాఁ బరికించుదము. రండు.

అంగ—త్రోవయే లేకున్న నెక్కడికి రమ్మందువు? ఇందుండి యెటులైన మనము బయటబడినఁ జాలును. సీతాదేవిని వెదకినంతే పుణ్యము.

జాంబ—అందఱము మిగుల డస్సి యాకలిఁగొని యుంటిమి. ఈ ప్రదేశమునఁ గొంతతడవు విశ్రాంతిఁగొని పోవుదము.

అంగ—శ్రమఁదీర్చుకొనక యిప్పుడెచ్చటకుఁ గదలఁ జాలము. కొంతసే పిందుఁ గూర్చుందము.

హను—సుగ్రీవుఁడు పెట్టిన నెలదినముల గడువు చేరువయైనది. వైదేహీవృత్తాంత మింతవఱకు మనకేమియుఁ దెలియదాయెను. ఏమిసేయుటకేమియుఁ దోఁచకున్నదికదా !

(అని యందఱు కూర్చుందురు.)

(స్వయంప్రభ ప్రవేశించి)

(తనలో) నాతండ్రియగు మనువు "కుమారీ! శ్రీరామదూతలు నీకడకు వత్తురు. వారలను భక్తిపూర్వకముగా సత్కరింపవలయును" అని నాతో చెప్పియున్నవాఁడు. వీరలే శ్రీరామదూతలు వచ్చియున్న వారలు. మిగుల నాకలి దప్పికలఁ గొనియుండిరి. నే నీ ఫలాదులఁగొని పోయి వారల సత్కరించెదఁగాక! (ప్రకాశముగా) మహాత్ములారా! శ్రీరామదూతలగు మీకు నే నీ ఫలముల నర్పించుకొందును. ఇవి స్వీకరించి నన్నుఁ గృతార్థురాలిని జేయుఁడు.

(అని ఫలము లిచ్చును.)

హను—(తీసికొని) మహాప్రసాదము.

అంగ—మిగుల డస్సియుంటిమి. వీనిని భుజియింతము.

(అని యందఱు భుజింతురు.)

హను—తల్లీ! మిగులదప్పికఁ గొనియుంటిమి. ఇం దెందైన నీరము లభించునే?

స్వయం—మహాత్ములార! అదియే సరోవరము.

జాంబ—జలములఁ ద్రావి దప్పికల దీర్చుకొందమురండు.

(అని అందఱు నీరుఁ ద్రావి వత్తురు.)

హను—మా ప్రాణావశిష్టకాలమున మమ్మాదరించి ఫలము లొసఁగి కాపాడిన సాధ్వీమతల్లీ! నీవృత్తాంతము మేము సవిస్తరముగా వినఁ గుతూహల పడుచుంటిమి.

స్వయం—మహాత్ములార! నేను మయుని తనయను. నాతండ్రి నా కీ ప్రదేశమున ఫలముల కీ వనియు, జలముల కీకొలనును నిర్మించి యున్నవాఁడు. నేనిందు సదా తపముఁ జేసికొనుచుందును. శ్రీ రామదూతలుగాన మీరా రిక్కడకు రాఁ గలిగితిరి. ఒరులెవ్వరు రాఁజాలరు. ఇదియే నావృత్తాంతము.

హను—శ్రీరామచంద్రుని భార్యయగు సీతామహాదేవి నేకూ్రరదానవుఁడొ కపటయత్నముఁ జేసి యపహరించుకొని పోవ నా సాధ్వీలలామజాడల నరయుచు మే మీ ప్రదేశముఁ జేరితిమి. జానకిజాడ లేమియు నింతవఱకుఁ దెలియదాయెను. మా ఱేఁడు సుగ్రీవుఁడు కూర్చిన గడువు దినము సమీపించు చున్నది. ఈ ప్రదేశము వీడిపోవుటకు మాకేమియుఁ ద్రోవ కానరాకున్నది. తల్లీ! దయయుంచి మాకు మార్గముఁ జూపెదవేని శీఘ్రమే పోయి గడువు దినములోపల వైదేహివృత్తాంతముఁ దెలిసికొనియెదము.

స్వయం—మహాత్ములారా! మీరందఱు కనుల మూసికొనిన నీ గుహనుండి వెలుపలకుఁ బోవుదురు. అటులఁ జేయుఁడు.

హను—యువరాజా!

అంగ—ఆలస్య మెందులకు?

(అందఱు కనుల మూయుదురు.)

[తెఱపడును]

---

## రంగము ౨

### ప్రదేశము—సముద్రతీరము.

(హనుమంతుఁడు, అంగదుఁడు, జాంబవంతుఁడు, నలుఁడు నీలుఁడు—ప్రవేశింతురు)

హను—అంగదా! గడువుదినము సమీపించినదిగదా!

అంగ—హనుమంతా! యిఁక నాకేమియుఁ దోఁచుటలేదు. నాపిన తండ్రియగు సుగ్రీవుఁడు క్రూరుఁడు. నాతండ్రి వాలి గతించిన పిమ్మట నాతల్లియగు తారను మోహించినాఁడు. ఈ యవమానము నేను భరియింతునే? అదియునుంగాక జానకీదేవిజాడ లింతవఱకు మనకేమియుఁ దెలియవాయె. కార్యము సాధింపఁ జాలక నింక నెటుల శ్రీరామచంద్రుని కడకుఁగాని సుగ్రీవుని కడకుఁగాని పోవుదము? ఈ సముద్రతీరమున నేను ప్రాయోపవేశముఁబూని ప్రాణముల విడచెదనోయి!

హను—నేనుకూడ నిఁకఁ జేయఁదగిన దదియే.

జాంబ—మీ యిరువురతోఁగూడ నేను!

నలుఁడు—, నీలుఁడు— } ఇఁక మేమా సుగ్రీవునికడకుఁబోయి "జానకీదేవి వృత్తాంతముఁ దెలిసికొనలేక సముద్రతీరమున హనుమదంగదాదులు ప్రాయోపవేశముఁబూని ప్రాణములు వీడిరి" అని చెప్పవారము? మీతో మేముకూడ ప్రాణములు వీడుదుము.

అంగ—సరి! అటులయిన నందఱము ప్రాయోపవేశముఁ బూనుదము. మనకీ జన్మలేల?

(అని అందఱు ప్రాయోపవిష్టులగుదురు)

(సంపాతి ప్రవేశము)

ఋష్యమూకాద్రినుండి నేఁడింకను నా కుమారుఁడు నాహారము దెచ్చి యుండలేదు. కారణ మేమయియుండవచ్చును?—ఇంక నాలస్య ముగ వచ్చునేమో? కానిమ్ము. నాకెట్టిశ్రమ కలిగించకుండ నా విధాత కరుణాకలితుఁడై నేఁ డీయైదుగుర నా కాహారముగా దగ్గఱకుఁ దెచ్చి పెట్టియున్నవాఁడు. ప్రస్తుతము వీరిని భుజియించి కొంతక్షున్నివారణఁ జేసికొనియెదను. (అని సమీపించి) వీరేదియో మాటలాడుకొను చుండిరి. వినెదను.

(అని యూరకుండును)

అంగ—పుణ్యాకరమైన శ్రీరామచరిత మింతవరకుఁ జెప్పకొనుచు ప్రాణములవీడిన మోక్షము లభియించునోయీ! మారుతీ!

హను—యువరాజా! నేను చెప్పెదను. మీరందఱు వినుఁడు.

జాంబ—హనుమంతా! శ్రీరామచరితము వ్రాసినను జదివినను విని నను జన్మలు తరింపవా?

నలుఁడు—
నీలుఁడు— } అందుకు సందేహ మేమికలదు? కానిండు.

హను—

తే॥ గీ॥ అల యయోధ్యాపురీనాథుఁ ♦ డైన దశర
థనరనాథునకు జనించి, ♦ ఘనతమీఱ
బాల్యమందునె రాక్షసా ♦ వళినిఁద్రుంచి
కౌశికునియాగ మంతటఁ ♦ గాచినాఁడు.

తే॥ గీ॥ గౌతమకళత్రశాపంబుఁ ♦ గరుణఁబాపి
మిథిలకే తేరి విల్లుఁ గూ ♦ ర్మిమెయిఁ ద్రుంచి
జానకినిఁబట్టి భార్గవు ♦ శక్తిఁగూల్చి
నిజపురికిఁ జేర భక్తితోఁ ♦ బ్రజలుపొగడ.

తే॥ గీ॥ పితృవాక్యముఁ బాలింపఁ ♦ బ్రేమతోడఁ
దైశకోరికఁదీర్పంగ ♦ గహనములకు
సోదరునిఁగూడి సీతతోఁ ♦ జొచ్చి పెక్కు
రక్కసుల దునుమాడె బ ♦ లోత్కర్ష్యమునను.

తే॥ గీ॥ కపటఁకుత్నముఁ జేసి లం ♦ కాధిపుండు
జానకీదేవిఁ గొనిపోవు ♦ సమయమందు
తగ జటాయు పోరాడి భూ ♦ స్థలినిఁగూలి
కౌసలేయున కీవార్తఁ ♦ గాంత్రుఁదెలిపి.

తే॥ గీ॥ ప్రాణములఁబాసిపోయిన ♦ పక్షినంత
నరసి దహనక్రియలఁ బ్రీతి ♦ నాచరించి
సతినిఁగూరిచి వనిలోన ♦ శ్రమలఁజెంది
శబరిభక్తికి మెచ్చి మో ♦ క్షంబొసంగె.

తే॥ గీ॥ అమర సుగ్రీవుతోడ స ♦ ఖ్యమునుబూని
కీశనాథునిఁగొట్టి కి ♦ ష్కింధఁగట్టి
యెలమి వైదేహి నరయ దూ ♦ తలనుబంపి
భక్తులనుప్రోచు శ్రీరామ ♦ భజనఁజేతు.

తే॥ గీ॥ రామనామము పఠియించు ♦ పామరునకుఁ
బావనంఘుంబుతొలఁగి వి ♦ శ్వంబునందు
సౌఖ్య మేర్పడుఁ దుదకు మో ♦ క్షంబుకలుగు
దైవముల నమ్మువారికిఁ ♦ దక్కువేమి?

(అని యూరకుండును.)

(సంపాతి దగ్గఱకుఁజేరి)

(తనలో) ఈమహాత్ము లెవరైయుందురు? శ్రీరామచరిత్రము జెప్పుకొనుచుండిరి. అందు నా సోదరుడగు జటాయువృత్తాంతము వచ్చినదే? సవిస్తరముగా నడిగి తెలిసికొనియెదను. (ప్రకాశముగా)

మహాత్ములారా! ఏకారణముననో విషాదపూరితమానసులై శ్రీరామ చరితముం జెప్పుకొనుచు పరుండియుండిన తమరెవరు? ఇంతకు మునుపు జటాయువు ప్రశంసం దెచ్చిరి. ఆ పక్షివృత్తాంతము నాకు సవిస్తరముగాం జెప్పుదరే?

అంగ—నీ వెవరవు ?

సంపా—నేను, జటాయు వన్నదమ్ములము. ప్రాయమున మే మిరువు రము మార్తండప్రియగు ననూరునికడకుం బోవుటకుం బందెముం బూని గగనమండలము నిర్గమించి చనునంత, ప్రచండచండ కిరణునిరశ్మిచే మాయిరువురపక్షములు భస్మములైన, జటాయువు దండకారణ్యభాగమందును నే నిందును పడితిమి. అప్పటి నుండి మాయిరువుర వృత్తాంతము లొకరికొకరికిం దెలియవు. మీ రిప్పుడు చెప్పుకొనుచున్న శ్రీరామచరితమందు జటాయు విషయము వచ్చినది. మీ రెఱుంగునెడల నా పులుంగు వృత్తాంత మేమైన నాకుం జెప్పుదరే?

హను—పక్షిరాజమా! మేము శ్రీరామదూతలము. ఆ మహాత్ముని యిల్లాలగు సీతామహాదేవిని దుష్టదానవుం డొకండు దపహరించు కొని పోవుచుండ దండకారణ్యమధ్యప్రదేశమున జటాయు— దశరథునకును, జటాయువునకును ప్రాణస్నేహమటకదా?

సంపా—అవును.

హను—దశరథుని పెద్దకోడలుకదా సీత! ఆభూపాలునకు తనకున్న మైత్రినింగూర్చియో, శ్రీరామమూర్తిపైం గల వాత్సల్యము చేతనో, జానకినిం గొనిపోవుచున్న దైత్యాధము నెదుర్కొని, హోరాహోరి పోరాడి పక్షములం గోలుపోయి పడి, రాఘవేంద్రున కీవార్తం దెలిపి మోక్షసామ్రాజ్యపదవినిం బొందియున్నది. సంపాతీ! దానికై చింతింపకుము.

సంపా—(దుఃఖముతో) మహాత్ములారా! మీరందఱు నన్ను గొని పోయి యీసముద్రమునఁ దముపుఁడు. స్నాన మాచరింతును. శ్రీరామదూతలగు మీచే సముద్రమున ముంపఁబడిన నాకు పత్రములు వచ్చును. పత్రము లేర్పడిన సీత యెందున్నదో చూచి చెప్పుదును.

అందఱు—అటులనే!

(అని సముద్రమున ముంచుదురు.)

సంపా—(వెలుపలకువచ్చి) మీరందఱి దయచే మఱల నాకు ఱెక్కలు వచ్చినవి. సీత యెందున్నదో యీపర్వతాగ్రము నుండి చూచి చెప్పెదను.

(అదృశ్యమై మఱలవచ్చి)

వానరులారా! రావణునిలంకారాజ్యమందు సీత యున్నది. వృద్ధాప్యము సంభవించినది కాన నేను రాఁజాలను. ఈ సముద్రమును లంఘించి మీ రచ్చటకుఁబోయిన యా సాధ్వీమణినిఁ జూడఁ గలుగుదురు.

అందఱు—సంపాతీ! నీవు వలదు. మేమే పోయెదము.

సంపా—మహాభాగులారా! యిఁక నేనుండుదునా?

అందఱు—ఇఁక నీవుండుము.

(సంపాతి నిష్క్రమించును.)

హను—యువరాజా!—

అంగ—శతయోజన విస్తీర్ణమైన యీ సముద్రమును లంఘించిపోయి సీతను చూచి వచ్చువారలెవ్వరు?

జాంబ—కార్యభారము మనపై నున్నది. ఎంతేసి పనులకైన సాహ సింపవలయును.

నలుఁడు—నే నిరువది యోజనములు మాత్రమే దూఁకఁగలుగుదును.

నీలుఁడు—నేను నలువది యోజనములు పోఁగలుగుదును.

జాంబ—యువరాజా! తొల్లి త్రివిక్రము విజయము చాటింపుచున్న ప్పుడు నాకు మోకాలిలో నొకకొండ విఱిగి యది యిప్పు డిప్పుడు కలకఁబాఱుచు కొంచెము కొంచెము బాధపెట్టు చున్నది. అది కాక వృద్ధాప్యము. ఇప్పటికైన నేనుబది యోజనములవఱకు ధైర్యమున్నది.

అంగ—శతయోజనములు నేను పోఁగలుగుదును కాని మఱల వచ్చు టకు మాత్రము ధైర్యములేకున్నది. ఇఁక నీకార్యమునకు సాహసు లెవ్వరు కలరు?

జాంబ—ఎవ్వరునులేరా? ఆంజనేయా! నీసంగతియేమి? నీశక్తియెట్టిదో నీవెఱుఁగఁ జాలవు. నేనుచెప్పెదను వినుము. పుట్టినప్పుడే నభో భూమి కెగసి ఫలభ్రాంతిచే రవిని నీవు మ్రింగఁ బోయినఁ గులి శాయుధుండు తన వజ్రాయుధముచేఁ గొట్టిన నీవామహాను వప్పుడు కొద్దిగా వంకరఁబోయి నొచ్చినది. హనుమంతుఁడను నామము నీకందుచే సార్థక మైనది. అష్టదిక్పాలురచే నమోఘ వరములఁ బొందినవాఁడవు. అంజనీపుత్రా! అవలీల సముద్ర మును లంఘించుటకు, ఆలంకాపురముఁ జొచ్చుటకు జానకీదేవి జాడల నరసి వచ్చుటకు నీవెకదోయి సమర్థుఁడవు? ఇప్పుడు మాటలాడక కూరకుందువేమి? నీధైర్య సాహస పరాక్రమములు నాకడనా దాచుట! నీకీకార్య సంఘటన మెంత? లెమ్ములెమ్ము.

అంగ—నిజముగా సమర్థుఁడవు నీవే! అందువలననే శ్రీరామచంద్రుఁ డు మనము బయలుదేరునప్పుడు నిన్నుఁ బిలిచి "ఆంజనేయా!

ఎప్పటికైన జానకీదేవినిఁ గనుఁగొనువాఁడవు నీవే! నీశక్తి సామర్థ్యము లత్యద్భుతములు. "సీతను గనుఁగొనిన నీవు శ్రీరామదూతవని యాసాధ్వి నమ్ముటకుఁగాను నా యీ ముద్రికను గుర్తుగాఁ గైకొనుము" అని తనముద్రిక నొసఁగినాఁడు. ఈ కార్యము నీవలననే నెఱవేరవలయును. జాగు సేయక సాహసింపుము.

నలుఁడు
నీలుఁడు } —అసమర్థుని వలె నటించు చున్నా వేమి? అంజనీపుత్రా! సాహసింపుము.

హను—వానర శ్రేష్ఠులారా! కానిండు, మీ మాటప్రకారమే పోయెదను.

అంగ—ఎటులైన సీత వృత్తాంతముఁ దెలిసికొనిరమ్ము.

జాంబ—ఆంజనేయునకు మనమేమియుఁ జెప్పనక్కఱ లేదు. ఆతఁడు సామాన్యుఁడు కాఁడు.

నలుఁడు
నీలుఁడు } సమర్థు లెట్టి కార్యములనైన సాధింతురుకదా!

హను—ఇఁక నేను పోయెదను.

అందఱు—జయమగుఁగాక! (అని యందఱు నిష్క్రమింతురు.)

[తెఱపడును.]



శ్రీ ర స్తు

# శ్రీరామపట్టాభిషేకము

—:o:—

## పంచమాంకము

### రంగము ౧

(ప్రవేశము—అశోకవనప్రాంతము)

(హనుమంతుఁడు ప్రవేశించును)

నా శ్రమయంతయు నిష్ఫలముగా నున్నదే!

ఉ॥ ఎక్కడ కానరాదు, హరి ♦ ణేక్షణ నెందుల దాచినాఁడొ? యా
ముక్కిడి రక్కసుం, డెటులఁ ♦ బోయెద నిప్డు లతాంగిఁ జూడఁగా?
నెక్కడి సీత యింక? గతి ♦ యించెనొ బల్మిని? రామచంద్రుఁడున్
గ్రక్కున రాఁడ నిన్ గరుణఁ ♦ గావఁగ, రావణు సంహరించియున్.

పంక్తికంఠుని శయ్యాగృహముతోఁ గూడ నీలంకాపురమందుఁ గల గృహములన్నియుఁ గలయఁ జూచితిని కాని జానకీదేవి యెందును గానరాలేదు. ఏమి సేయుదును? దైవమా!—ఈ రావణుఁ డా సాధ్వి నింక నెక్కడ దాచియుండును? ఆ కాంతాలలామ బ్రతికియుండునా? దశాననునిఁ జేపట్టినందులకుఁ గినుకఁ జెంది యా క్రూరరక్కసు లా వైదేహిని బలాత్కారముగాఁ జంపియుండరు కదా! ఇంత కార్య మెప్పటికిని జరుగ నేరదు. పతివ్రతాశిరోమణియగు యా జగజ్జననినిఁ దాఁకిన నీలంకా

పురీ రాక్షసులందఱు భస్మముకారే? క్రూరరావణుని సంహరించి తనను బ్రోచుట కింక శ్రీరామచంద్రుఁడు రాఁడని యధైర్యమున నాసాధ్వీ మతల్లి యాత్మహత్యఁ జేసికొనియుండునా? అయ్యో! అంతపని జరిగి యుండునే? అమంగళ మప్రతిహతమగుఁగాక! కార్యము సాధింపఁజాలక రాఘవేశ్వరునికడ కెటులఁబోవుదును? పోయి "శ్రీరామచంద్రా! సీత లేదు" అని యెటులఁజెప్పుదును? ఎప్పటికైన నీకార్యము సాధించుశక్తి సామర్థ్యములు కలవాఁడను నేనేయని తలఁచికదా రఘురామచంద్రుఁడు తనముద్రికఁగూడ నాకొసఁగి "వైదేహి కడి యొసంగుము" అని చెప్పియున్నవాఁడు! సీతాదేవి వృత్తాంత మరసికొని ముద్రిక నొసఁగి నేనువచ్చెదనని యాభగవానుఁ డింక నెంతయాశతో నున్న వాఁడోకదా? హా! హతవిధీ!—(అని దుఃఖించును) కార్యము సాధింప వలయునుకాని దుఃఖించినఁ బ్రయోజనమేమి? ఈలంకాపురమందు నాసీతామహాదేవికై నే నింకఁ జూడవలసియున్న దీయశోకవన మొక్కటియే! పోయి యదికూడ చూచెదను.

(అని నిష్క్రమించును)

[తెఱపడును]

---

రంగము ౨

ప్రదేశము - అశోకవనము.

(సీత - రావణుఁడు ప్రవేశింతురు.)

సీత—(కోపముతో) ఛీ! క్రూరాత్మా! దూరముగఁ బొమ్ము. సర్వ జగద్రక్షకుఁడైన శ్రీ రామమూర్తికిని, నీకును సాటియేడ? నీకు వినాశకాలము దగ్గఱకు వచ్చినదిగాన నిట్టి విపరీతబుద్ధి జనియించినది.

రావ—లేమా! యెంత బేలవు!

మ॥ నరుఁడా రామునిఁబట్టి యేమిసుఖముం ♦ దఁగఁ జూచినావో కదా!
తరుణీ! ముగ్ధవు కాని, మ జ్జగములన్ ♦ దర్పోద్ధతిన్ గెల్చి సు
స్థిరకీర్తిన్ గనినట్టి నాకెటుల నీ ♦ శ్రీరాముఁ డీడౌను? వే
గిర మీభ్రాంతినివీడి మోదమునఁ గ♦ల్కీ! నన్నుఁ జేపట్టవే!

మ॥ అల దేవాంగనలెల్ల సంతతముఁ జె ♦ ల్వారంగ నీకున్ సప
ర్యలఁ జేయన్ జను దేరి రారె? యొకసౌ ♦ ఖ్యంబా? కొఱంతేమి? యిం
క లతాంగీ! త్రిజగంబులున్ గొలువ లం ♦ కారాజ్య పీఠస్థలిన్
వెలుఁగన్ గోరిక కాదె? యేల యిటు సం ♦ దేహింతు వబ్జాననా!

జానకీ! శ్రీరామచంద్రునితో నీకు ఘోరవనవాసప్రాప్తియు, శిలాకంటకభూముల శయ్యలు, జీర్ణవల్కలధారణ, కందమూలాది భక్షణ మీఁదుమిక్కిలి పడరాని యిడుములుతప్ప నొకభోగమా? భాగ్యమా? సౌఖ్యమా? సంతోషమా? ఏమున్నది? ఆనిర్భాగ్యుని వీడి నన్నుఁ జేపట్టునెడల నిన్నఱచేతులలో నాడింపఁగలను. కల్యాణీ!

సీ॥ లీలజగముల గె ♦ ల్చితిని నేనేకాని
ముదితరో! నీదు రా ♦ ముండుకాఁడు
లితయశం బెందుకాం ♦ చితిని నేనేకాని
యువిదరో! నీదురా ♦ ఘవుఁడుకాఁడు.
ఆజి శూరుఁడనైన ♦ నరయ నేనేకాని
యువతి! నీ కౌనలే ♦ యుండుకాఁడు
భక్తులఁబ్రోచెడి ♦ వాఁడ నేనేకాని
తరుణిరో! నీదు దా ♦ శరధికాఁడు

తే॥ గీ॥ సుందరుఁడను నేనేకాని ♦ క్షోణియందు
తోయలీ! నీదు రామచం ♦ ద్రుండుకాఁడు
ఏమిమెచ్చవ నాకన్న ♦ రామమూర్తి
బాల! యతనిపై నీభ్రాంతి ♦ యేలనీకు?

రాముఁ డెద్దాన నన్నుఁబోలఁడు. ఇఁక నైన సుఖములఁ బడయఁ గోరెదవేని యారాముని వీడి నన్నుఁ జేపట్టుము.

సీత—(కోపముతో) పాపాత్మా! ఏమిరా నీవదరుఁబోతుఁదనము! నోటి కివచ్చునట్లెల్ల ప్రేలుచుంటివి?

చ॥ పొలుపగు బ్రహ్మవంశమునఁ ♦ బుట్టినవాఁడవు సిగ్గులేదె? యీ
పలుకులునాయమే! శ్రుతుల ♦ బాగుగనేర్చిన కారణంబొ? బల్
సిలుగుల ఘోరపాతకముఁ ♦ జేసినకారణమో? దురాత్మ! ఛీ!
తొలఁగుము నీవు నా యెదుట♦దూష్యుఁడ వెంతయు? దానవాధమా!

ఛీ! నీమొఁగముచూచినంతఁ బాపములు పైఁబడును.

రావ—(మందహాసముతో) జానకీ! నీనిందావాక్యములు నాకుఁబ్రియములే!

(సమీపవృక్షముమీదఁ గూర్చుండి హనుమంతుఁడు తనలో)

ఈదైత్యాధముఁ డీ పతివ్రతాతిలకమును బాధించుచున్నవాఁడు కదా! అయ్యో! యీజానకీదేవి దురవస్థచూచుచున్న నాహృదయము నీఱగుచున్నది. హా! హతవిధీ!—ఎట్టిసుకుమారికి—ఎట్టిపతివ్రతామతల్లికి—ఎట్టిపాట్లు పెట్టితివి! ఈపౌలస్త్యున కీదుర్బుద్ధి యూరక జనియించినదా? నాశమునకేకదా!

సీత—(కోపముతో) దుష్టాత్మా! నీతో నధికప్రసంగముగా నేను మాటలాడుటయే తప్పు.

రావ—ఇంతకోపమా?

మ॥ పడఁతీ! రామునిపాటిఁజేయుదునె? మహా ♦ పాపుండనే నేను? కా
అడవిన్ భార్యనుదింపినానె? సతిహా ♦ హామ్మాని విచ్చేయఁగాన్

వడి నాతమ్ముని దాని ముక్కుసెవులన్ ♦ ఖండింపుమన్నాన యే
దుడుకున్ జేసితి వల్కకుండుటకు నా ♦ తో నీవు బింబాధరీ!

మ॥ లలితోద్యాన వనప్రదేశముల లీ ♦ లన్ దేవతాస్త్రీలతో
మెలఁగన్ వచ్చును, హంసతూలికలఁ గూ ♦ ర్మిన్నేరి, రాచిల్క ప
ల్కులనాలింపుచు, కాలమున్ గడుప ని ♦ క్కన్ వేడ్కయే కాదె యెం
దుల కీజాగు? రఘూద్వహున్ విడిచి నా ♦ తో సౌఖ్యమున్ బొందవే!

ఉ॥ మక్కువ దేవతాగణము ♦ మానవసంతతియున్, భయస్థులై
యెక్కువనాకు మ్రొక్కెదర ♦ దెంతటివాఁడనో గాక యున్న? నీ
చక్కఁదనంబుఁ జూచి సుమ ♦ శస్త్రనిబారికి తాళఁజాలకన్
మ్రొక్కెద నిన్నియేల? యిఁక ♦ ముద్దియ! వేగ మొకోర్కెదీర్పవే?

సీ॥ చివురుటాకుల మేసి ♦ సిలుగుఁజెందఁగ గదా!
కోయిల లీపాట ♦ కూయనేర్చె
భూమిఫలాహార ♦ మునఁ దపింపఁగఁగదా!
చిలుకలు నీపాటి ♦ పలుకనేర్చె
విరుల తేనియఁ ద్రావి ♦ పరగుచుండుటఁగదా!
తుమ్మెదనీచూపుఁ ♦ దొడరనేర్చె
నీరముం గ్రోలి కా ♦ సారవాసమునఁ గ
దా! యంచ నీ నడ్కఁ ♦ దనరనేర్చె
తే॥ గీ॥ రమణి! యిటువంటి నీతోడ ♦ రతులఁదేలు
భాగ్య మెంతటివానిదో ♦ వసుధయందు?
కాంచ లభ్యంబె సామాన్య ♦ కాముకులకు
ఘోరతపముల శ్రమలంది ♦ కుందకున్న?

ఉ॥ రాముఁడు లక్ష్మణుండయిన ♦ రారిట కెప్పటికైనఁగాని, యో
కోమలి! యాశవీడు మిటు ♦ కుందిన లాభము లేదు నీవు, నీ
కేమి కొఱంతయున్నది వ ♦ రించిన నన్ను సుఖమ్ముఁ జెందవే?
తామసమేల యింత? కడు ♦ ధన్యవు బ్రహ్మకులంబుఁ జొచ్చినన్.

కాన బాగుగా యోచించుకొనుము.

సీత—(కోపముతో) రాక్షసాధమా! యోచించుటెందులకు? నీదుర్భావలకు నిన్నీవఱకెప్పుడో నా పాతివ్రత్యమహిమచే శపియించియుందును గాని, త్రిలోకరక్షకుఁడగు శ్రీరామచంద్రుఁడేవచ్చి సంహరించునని యూరకుంటిని.

ఉ॥ ఇప్పటికైన నీవు రజ ♦ నీచర! రామునిఁజేర్చి నన్ను నే
తప్పొనరించినాఁడ నిటు ♦ దాశరథీ! క్షమియింపుమన్న నిన్
దప్పకఁబ్రోచు రాఘవుఁడు, ♦ ధన్యుఁడవయ్యెద వంతె కాని, నీ
కెప్పుడు మేలుకాదు పర ♦ యింతుల నీగతి బాధపెట్టుటల్.

శ్రీరామచంద్రుఁ డార్తజనశరణ్యుఁడు.

రావ—(నవ్వుచు) ఇంతీ! నీ శ్రీరామచంద్రుని పరాక్రమము నేనెఱుఁగననుకొంటివా? శరణుఁజొచ్చినవార లుండినకదా రాముఁ డార్తజనశరణ్యుఁడౌట.

సీత—(కోపముతో) కుటిలాత్మ! నీకు నానాథుని చేతిలో మరణమే నిక్కవము. పొమ్ము.

రావ—(కోపముతో) ఊరకొన్న కొలఁది కారుకూఁతలు రానిచ్చుచుంటివా? నన్నుఁజేపట్టుట కిచ్చగింపనియెడల నిన్నీ యశోకవనలక్ష్మికి బలిగా నొనర్తును చూడుము.

(అని మీఁదకుఁ బోవుచుండ)

(రాక్షసాంగన వచ్చి) రజనీచరకుంజర! కోపము వలదు. ఆఁడుదానినిఁ జంప సాహసింపకుము.

రావ—(శాంతముతో) జానకీ! బాగుగ నాలోచించుకొనుము. ఇంక రెండు నెలల గడు విత్తును. (అని రాక్షసాంగనలతో) అంగన

లారా! యీయలివేణికి రాముని పైఁగల ప్రేమ మఱపించి, నన్నుఁగూర్చి బాగుగ బోధించి యింక రెండునెలల గడువులోఁ జేపట్టుటకు మీశక్తినంతయు వినియోగింపుఁడు. ఇఁక నేను పోవుచుంటిని. (అని నిష్క్రమించును)

హను—(తనలో) ఈదానవాధముఁడు పోయినాఁడు కాని రాక్షస ముండలింకను చుట్టూమూగి యున్నారు. వీరలుకూడ పోవువఱకు నేనిందే యుండెదను. (పరికించిచూచి) అప్పుడే రాక్షస ముండయొకతె సీతాదేవితో దుర్భాష లాడుచున్నది.

1 రాక్ష—జానకీ! రావణుఁడు సామాన్యుఁ డనుకొంటివే?

తే॥ గీ॥ ఇంద్రునంతటి వాని జ ♦ యించినాఁడు
త్రిభువనంబులు పొగడు కీ ♦ ర్తిని వహించెఁ
బంక్తికంఠుని యెఱుఁగని ♦ వారలెవరు?
కలికి! పతియౌట యతఁడు భా ♦ గ్యంబుకాదె?

ఆతనిఁ జేపట్టుటకు సందేహింతు వెందులకు?

2 రాక్ష—సీతా! నిజముగా నీవు రామునివదలి రావణునిఁ జేరిన సుఖపడియెదవు. ఆఁడువారికి సుఖము కన్న నింక నేమి కావలయును?

4 రాక్ష—వైదేహీ! నీవు ముగ్ధవు. జీర్ణవల్కలముల ధరియించి కానల కందమూలము లేఱుకొనుచు నెటులో బ్రతుకుచున్న రాఘవు నికడ సౌఖ్యమేమి కనెదవమ్మా! పౌలస్త్యునిఁబట్టి లంకారాజ్యమునకు రాణివై యుంట నీకెంతభాగ్యము? లోకాపవాదమే మైనవచ్చునేమో యని భయపడుచుంటి వేమో? లంకారాజ్యమున కెవ్వరు రాఁజాలరు. వచ్చిన జీవములతో మఱలఁ బోరు. నీవృత్తాంతమెప్పటి కెవ్వరికిఁ దెలియఁబోదు. ఇంక భయమేమి? సుఖపడియెదవు. దశవదనునికోర్కెఁ దీర్పుము.

1 రాక్ష—(కోపముతో) బ్రతిమాలిన వినవుగదే! నీవే రావణునకు బత్నివి కానిపక్షమున యీరాక్షసకాంత లిప్పుడే నిన్ను మ్రింగి వేతురా?

2 రాక్ష—ఇన్ని మాటలేల? లంకానాయకునకు బత్నివయ్యెదవా? చావున కిచ్చగించెదవా? ఏదిగూ యొకటి తేల్చిచెప్పుము.

3 రాక్ష—జనకజా! వననిధిదాటి, లంకను జేరి, యీని రావణునిఁగొట్టి మేమందఱ మిందు కావలియుండ నినుఁగొనిపోయెడి మనుజుఁ డెవఁడమ్మా!

1 రాక్ష—ఇది మనమాటల నిఁక వినదు. రక్తముఁగ్రోలి మన మందఱము దీని నిప్పుడే భక్షింతము రండు.

(అని యందఱు సీతపైఁబడ నుంకింతురు.)

(త్రిజట నిదురనుండి లేచి)

దానవాంగనలారా! ఆగుడనువలదు. శ్రీరామలక్ష్మణులు వానరబలగములతో లంకపై దాడివెడలి మన యేలికయగు రావణుని సంహరించి సీతాదేవినిఁ గొనిపోయినట్లుల నే నొక కలఁగంటిని. దైత్య రాజ్యంబు దురవస్థల పాలై పోవుటకు సందియంబు లేదు. మీా రీసాధ్వీ మణిని బాధపెట్టవలదు. (సీతవంకఁజూచి) సాధ్వీమణీ! ఖేద మొంద కుము. ఇంత యధైర్య మేమి? ఇఁక నీనాథుఁ డచిరకాలములో నేగు దేరి నిన్నుఁ గాపాడును.

సీత—(దుఃఖముతో) ప్రాణేశ్వరా! ఎన్నఁడుకాని యీదరిద్రురాలినిఁ గూర్చి లంకాపురముఁజొచ్చి క్రూరరావణుని సంహరించు దువే? నా యగచాట్లుఁ బాపుదువే? హా! విధీ! రావణుని క్రూరత్వమునకు భయపడుదునా? ఈ రాక్షసాంగన లిచ్చు బాధలకు వెఱగుఁజెందుదునా? నా జీవితేశుఁ డేతేరి నన్ను

గాపాడఁడని చింతిలుదునా? ఏమిసేయుదును? మనోహరా ఆమాయలేడి మన వియోగమునకే వచ్చినదికాఁబోలు! బుద్ధి పూర్వకముగాఁ దెచ్చుకొనిన నేనీయుగచాట్ల ననుభవింప వలదా? "జానకీ! ఏమి యెఱుఁగనిదానవు. నీకీయరణ్యవాసము వల"దని నాయత్త లెంతవారించినను "నా నాథునితో నా కెందున్నను భయములే"దని చెప్పి యరణ్యమందైన నేమి జీవితేశునితో సుఖముగాఁ గాలము గడుపవచ్చితినిగాని దైవమా! యీ వియోగదుఃఖభరము నేనెటుల భరింపఁగలను!

(అని యూరకుండును.)

త్రిజట—వైదేహీ! ఊఱడిల్లుము. కష్టములు కలకాల ముండునా? నీకిఁక నచిరకాలములో శుభములు చేకూరును.

రాక్షసాంగనలు—ఈపిశాచము నిటులనే యేడువనిండు. మనమందఱ మిప్పుడు మద్యముఁద్రావి పిమ్మట దీనిపని పట్టుదము. రండు.

(అని యందఱు మద్యముఁద్రావి నిదురఁజెందుదురు.)

హను—(తనలో) ఈముండల పనియైనది. మద్యముఁద్రావి యందఱు నొడలుమఱచి పడిపోయిరి. ఈ సీతామహాదేవికి నన్నెఱిం గించుకొనుట కిదియే తగినసమయము. శ్రీరామచరితముఁ జెప్పుకొనుచున్న నస్త్రీ సాధ్వీమణి తెలిసికొనునేమో?

(ప్రకాశముగా)

సీ॥ దశరథపుత్త్రుఁడై ♦ తపసియాగముఁగాచి
రమణి యహల్యశా ♦ పమునుమాపి
హరుపిల్లు నవలీల ♦ విఱచి, జానకిఁబట్టి
ముదమూగ పరశురా ♦ మునిజయించి

కైకకోరికఁదీర్పఁ ♦ గా, సోదరునిఁగూడి
జనకజతోడఁ గా ♦ ననముఁజొచ్చి
హరిణంబుకై పోయి ♦ యతివనుగోల్పోయి
కపిరాజుతోడ స ♦ ఖ్యంబుఁజేసి
తే॥ గీ॥ వాలినింగొట్టి, సుగ్రీవుఁ ♦ బ్రభువుఁజేసి
వానరులఁ బంపి యున్నాఁడు ♦ వనితకొఱకు
జానకీదేవి జాడలు ♦ కానరావు
రాముఁ డేరీతి నింకపైఁ ♦ బ్రతుకఁగలఁడొ?

(అని యూరకుండును.)

సీత—(ఆశ్చర్యముతో పైవంకఁజూచును) ఆఁ! కలలో వానరునిఁ జూచితిని. దుఃస్వప్నదోషపరిహారణంబుగా శ్రీ రామచంద్రుని నామము వేమారు పఠియించెద. శ్రీరామచంద్రా! శ్రీరామ చంద్రా!

హను—(తరువునుండి దిగివచ్చి సీతకు మ్రొక్కుచు) పతివ్రతామతల్లీ! నేను హనుమంతుఁడను. శ్రీరామదూతను.

సీత—శ్రీరామచంద్రునకు క్షేమమా?

హను—తల్లీ! క్షేమము.

సీత—సౌమిత్రి కుశలుఁడేనా?

హను—అమ్మా! కుశలుఁడు.

సీత—(దుఃఖముతో) దైవమా! నాజీవితేశునకు నాజాడలెటుల తెలియును?

హను—(తనలో) ఈ సాధ్వీలలామ యింకను సంశయముతోనే యున్నట్లున్నది. సంశయునివర్తిఁ జేసెద. (ప్రకాశముగా) సాధ్వీమతల్లీ! నేను శ్రీరామునకు దూతను. నన్నాభగవానుఁడు నీ జాడలకే పంపియున్న వాఁడు. అంగదజాంబవదాది వీరులతో నేను

దక్షిణదిక్కునకేగుదేరివచ్చితిని. నెల దినముల నుండియు నీకై వెదకుచుంటిని. తల్లీ! నేఁటికి కదా ధన్యుఁడనైతిని. ఇదిగో శ్రీరామచంద్రుని ముద్రిక (అని యిచ్చును).

సీత—(తీసికొని) హనుమంతా! ఈరాక్షసాధము నిఁ గూల్చి నన్నుఁ గొనిపోవుటకు నాప్రాణేశ్వరుఁ డెప్పుడు వచ్చును? ఎప్పటికైన వచ్చునా? సౌమిత్రి యేమనుచున్నవాఁడు? నిర్దుష్టుఁడగు నాతని నేను పలునిందావాక్యము లాడితిని. ఆ పాపమే యిది!

హను—జానకీ! రామలక్ష్మణులు నిన్నుఁ బాసినది మొదలు నేఁటివఱకు సరియైన నిద్రాహారములు మాని పలుశ్రమలు పడుచుండిరి. నిమిషములో నబ్ధిఁగడిచి నీపతికడకు నిన్ని లంకా ద్వీపముతో నైనఁ గొనిపోయెదను. నా వీఁపెక్కుము.

సీత—(నవ్వుచు) ఆంజనేయా! నీ వతిసూక్ష్మగాత్రుఁడవు. నన్ను నా పతికడకు లంకాద్వీపముతోఁ గూడ వీఁపునబెట్టుకొని యెటుల కొనిపోయెదవు?

హను—మాతా! నా నిజరూపుఁ జూపెదను.

(అని నిజరూపుఁ జూపును.)

సీత—(ఆశ్చర్యస్తబ్ధయై) ఆంజనేయా! నీవొక్కనివైన సమర్థుఁడవు. శ్రీరామచంద్రునికడకు నీవుపోయి నావృత్తాంతముఁ దెల్పి, యెటులైన నింక నొక్క నెలదినములు ప్రాణంబులు చిక్కఁబట్టుకొని యుండెదఁగాని, యీాగడువులోపలవచ్చి క్రూరరావణునిఁగూల్చి నన్నుఁ జేకొని పొమ్మనుము. మారుతీ! యీాదైత్యాధముఁడు పెట్టుబాధలకు నేనిఁక బ్రతుకఁజాలను.

హను—జానకీ! యీారావణుని శ్రీరామచంద్రుఁ డచిరకాలములో వచ్చి సంహరించి నిన్నుఁగొనిపోవును. ఇఁక భయమువలదు,

సీత—హనుమంతా! చిత్రకూటాచల పూర్వోత్తర పార్శ్వంబున ఫల దళకుసుమ సమృద్ధంబైన తాపసాశ్రమంబొప్పు. ఆచేరువ సిద్ధాశ్రమంబుకలదు. తత్సమీపంబున మందాకినీతీరంబున నొక యుద్యానవనమందు నొకనాఁడు నేను రాఘవేశ్వరునితో విహరించి జలకేళిందేలి విశ్రమించిన, నొక్క కాకఁబువచ్చి, నా పయ్యెద కొంగు చుంచుతుండాగ్రంబున నడలించి, వక్షః స్థలమంతయు నఖాగ్రంబున విదళించినఁ గినుకఁజెంది మత్ప్రాణేశుఁడు దానిపై బాణమువిడిచెను. అదియు వెంటనంటి, దాని వేధింపఁ జొచ్చిన, నాబాధకుఁ దాళఁజాలక మఱలివచ్చి, "శ్రీరామ చంద్రా! అపరాధముఁ జేసితి. క్షమియింపు"మని వేఁడుకొన, నా కృపాళుండు "నాబాణ మవంధ్యము. నీయంగములలో నేదియైన నీ"మ్మన నాకాకఁబు తన యొక్క నేత్రం బర్పించెను. ఇదియే కాకాసురవృత్తాంతము. నాప్రాణేశున కిది నన్నునీవు కనుఁగొనినందులకు గుర్తుగాఁజెప్పుము. ఈ శిరోమణికూడ కొంపోయి యిమ్ము. (అని శిరోమణియిచ్చును)

హను—(తీసికొని) మహాప్రసాదము. (కనులకద్దుకొనును)

సీత—ఆంజనేయా! నెలదినములు మాత్రమే యిఁక సీతబ్రతికియుండునని రాఘవేశ్వరునితో విన్నవింపుము. ఈగడువులోననే వచ్చి దుష్టరావణుని సంహరింపుమనుము. నామఱఁది సౌమిత్రిని యడిగితినని చెప్పుము. అకారణముగా, మందమతినై తనను నిందావాక్యము లాడితినిగాని, లక్ష్మణుని యవివెల్ల మఱచి పొమ్మనుము. మారుతీ! యిఁక బొమ్ము.

హను—(లేచి నిలువఁబడి) తల్లీ! జానకీ! పోయెదను. (అనికొంతదూరమునడచి) రావణుని యీ యశోకవనము కనుల కింపుగా నున్నది. దీని నామరూలాగ్రముగాఁ జెఱచెదను.

(అని కొన్నితరువుల విఱచును)

[తెఱపడును]

—* యుద్ధరంగము 3 *—

(హనుమంతుఁడు ప్రవేశించును.)

అశోకవన భంగమైనది. జంబుమాలిని, మంత్రిసుతసప్తకంబును జంపుటయైనది. సేనానాయక పంచకంబును మడియించుటయైనది. అక్షయకుమారుని సంహరించుటయైనది. ఇఁక నా యింద్రజిత్తా మిగిలినది! కానిమ్ము.

(తెరలో)

ఓరోరీ! క్రూరాత్మ! ఎంతపనిఁ జేసితివిరా?

హను—వచ్చితివా? రమ్ము. రమ్ము.

(ఇంద్రజిత్తు ప్రవేశించును.)

ఇంద్ర—కోతివాడవని దయఁదలఁచినందుల కింతపనిఁ జేసితివిరా?

(అని బాణము విడచును.)

హను—నీవా నన్నదలించువాఁడవు!

(అని వేఱొకబాణము విడుచును.)

(ఇరువురు నిష్క్రమింతురు.)

(మఱల నింద్రజిత్తు ప్రవేశించి)

రాక్షసయోధులారా! బెదరిపోకుఁడు. బెదరిపోకుఁడు. ఈ కోతివాఁడెంత! చుట్టూ క్రమ్ముకొనుఁడు.

(అని నిష్క్రమించును.)

(మఱల హనుమంతుఁడు ప్రవేశించి)

రాక్షసధ్వంసమునకే నే నిక్కడకు వచ్చియుంటిని. ఆ పనియే యిప్పుడు జరుగుచున్నది. ఓరీ! పాపాత్మా! నీమద మడంచెద రమ్ము.

(అని నిష్క్రమించును.)

(ఇంద్రజిత్తు ప్రవేశించి)

కోతివాఁడైన వీఁడు గట్టివాఁడు. ఏశస్త్రమునకు వెఱవలేదుకదా! ఈతటి బ్రహ్మాస్త్రము సంధించెద.

(అని బ్రహ్మాస్త్రము వేయును.)

(హనుమంతుఁడు ప్రవేశించి)

బ్రహ్మాస్త్రమును సంధించినాఁడు. దీని కిప్పుడు బద్ధుఁడనై రావణునిఁజేరి యాతనికి గొన్నిహితవులఁ జెప్పెదను.

(అని నిష్క్రమించును.)

(రాక్షసులందఱు హనుమంతుని బంధించెదరు)

(ఇంద్రజిత్తు ప్రవేశించి)

ఇఁక వీనిని నాతండ్రికడకుఁ గొనిపోందు. తగినపని జఱుగును.

(అని యందఱు నిష్క్రమింతురు.)

(తెఱపడును)

---

రంగము ౮

ప్రదేశము—రావణుని కొల్వుకూటము.

(రావణుఁడు, విభీషణుఁడు, ప్రహస్తుడు, యింద్రజిత్తు, హనుమంతుఁడు, రాక్షసులు ప్రవేశింతురు.)

రావ—విభీషణా! వీఁడసాధ్యుఁడు. విడిచిపెట్టిన మోసమువచ్చును.

విభీ—రాక్షసేంద్రా! క్రూరకార్యమునకు సాహసింపవలదు.

రావ — తమ్ముఁడా! నా వైరిపక్షమున దూతవై వచ్చి, నా పురమందున్న యుద్యానవనములన్నియుఁ బాడుఁజేసి యనేకయోధుల సంహరించి, నాకుఁ గీడొనరించుచున్న వీనిని విడిచిపెట్టిన మోసము రాదె?

హను — రావణా! శ్రీరాముఁ డవతారపూరుషుఁడు.

ఉ॥ సీతను సంగ్రహించితివి ♦ చిత్తజుబారికి నిల్వలేక, వి
ఖ్యాతివహించినాఁడ వెక ♦ దా! భువనంబుల రాక్షసేశ్వరా!
నీతిదొలంగి బల్మిఁ బర ♦ నీరజనేత్రలఁ దెచ్చుటొప్పునే?
సీత పతివ్రతామణి, న ♦ శింతువు భద్రము సుమ్ము రావణా!

చం॥ అడవులఁ గుందుచున్నను, మ ♦ హాబలుఁ డా రఘురామమూర్తి, యె
ప్పుడొ చనుదేరివచ్చి, నినుఁ ♦ బోరునఁగూల్చును నిశ్చయంబుగాన్
దుడుకుతనంబుమాని "కడు ♦ దోసముఁజేసితిఁ గావుమంచు" నా
పుడమిజనిచ్చినన్ బ్రతికి ♦ పోదువు నీవిఁక దానవేశ్వరా!

రాఘవేశ్వరుఁడు సామాన్యుఁడని తలఁచితివా? మున్ను నీ కెత్తుటకుఁగూడ శక్యముకాని ధూర్జటివిల్లు నవలీల విఱచినాఁడు. నిన్ను జెఱఁబట్టిన కార్తవీర్యార్జునుని సంహరించిన పరశురాముని జయించినాఁడు. వాలమున నిన్నుఁజుట్టికొని యెల్లసముద్రములందు ముంచి లేవనెత్తిన వాలినివధియించినాఁడు. ఎంతెంతవారలో దాశరథి పరాక్రమమునకునిలువఁజాలరైరి. రావణా! యింద్రునిజయించిన వాఁడవైననేమి?— త్రిజగత్కీర్తి విశాలుఁడ వైననేమి?— క్రూరరాక్షసపతివైననేమి?— నీవీ విషయమున మాత్రము మా శ్రీరామచంద్రుని శరణుఁ గోరక తప్పదు. నీప్రాణములపై నీకాశకలదేని—ఇంకను గొంత కాలము వఱకైన నేకచ్ఛత్రాధిపత్యము వహించి యీ లంకాపురముఁ బరిపాలింపదలఁచితివేని;— ఇంక నింతవఱకు సంపూర్ణభోగ్యతాదశతో, సర్వశోభలతో లోకములందు కీర్తివహించి యుంటివి కావఁ జెప్పు

చుంటివి;—సీతామహాదేవినిఁ గొనిపోయి శ్రీరామచంద్రుని శరణ్పించి శరణు వేడుకొందువేని ధన్యుఁడ వగుదువు. కరుణాసింధుఁడగు నా భగవానుఁడు నిన్ను తప్పక రక్షించును. అట్లుకాక మదాంధుఁడవై ప్రవర్తించు నెడల—ఆ రాఘవేశ్వరుఁడేల? నేనే యీలంకాపురమంతయు నిప్పుడే ధ్వంసముఁజేసి, నిన్ను యమపురికిఁ బంపి జానకీదేవి చెఱవిడిపింపఁగలను. నీ కీహితములఁ జెప్పఁదలఁచి, వేఱొకరీతి నీదర్శనము కాదని యీ బ్రహ్మాస్త్రమునకు బద్ధుఁడనై యిక్కడకు వచ్చితినికాని, లేనియెడల నన్ను నీయింద్రజిత్తుకాదుకదా యీ లంకాపురమంతయు నైనవచ్చి బాధింపఁగలరనుకొంటివే? పంక్తికంధరా!

రావ—(కోపముతో) ఓరీ! మర్కటాధమా! నిన్నుఁ దయఁదలఁచి యూరకొనుచున్నందులకా నీ నోటికి వచ్చిన ట్లెల్ల ప్రేలుచుంటివి? నేను దలఁచుకొను నెడల నీ వెంత? నీరాముఁ డెంత? (అనిభటులఁజూచి) రాక్షసవీరులారా! యీ వానరాధముని మీ రిప్పుడే కొనిపోయి చంపివేయుఁడు.

విభీ—లంకేశ్వరా! క్రూరత్వమునకు సాహసింపకుము. ఈ నీ కోపమునకు బెదరి పోవుట కితఁ డగ్నిదేవుఁడా? వరుణుఁడా? ఈశానుఁడా? వాయువా? ఆదిశేషుఁడా? కుబేరుఁడా? కీనాశుఁడా? కోణేశుఁడా? ఏ యెగ్గులాడినను వీఁడు నీకు వధ్యుఁడుకాఁడు.

ప్రహ—వధ్యుఁడుకాఁడా?

విభీ—ఎన్నటికి కాఁడు.

ఇంద్ర—ఈ కోతివాఁ డసాధ్యుఁడే!

విభీ—దైత్యేశ్వరా! దూతను జంపుట మహాపాతకము కావున వీనిఁ జంపింపవలదు.

రావ—(శాంతిపడి) రాక్షసులారా! తరుచరులకుఁ బ్రియకరమైనది వాలము కావున మీ రందఱు వీనిఁ గొనిపోయి తోఁకఁగాల్చి

నక్తంచరులందఱు చూడఁగా నీలంకాపురవీథులన్నియు గలయఁ
దిరిప్పుఁడు. పోండు.

రాక్ష—(సంతోషముతో) చిత్తము. చిత్తము. అట్లనే!

(అని అందఱు నిష్క్రమింతురు.)

[ తెఱపడును ]

---

రంగము ౫

ప్రదేశము—అశోకవనము

(సీత విచారముతోఁ బ్రవేశము)

అయ్యో! యీరాక్షసు లెంతటిపనుల కైన సాహసులుకదా! ఇదియు నాప్రారబ్ధమే! కానియెడల శ్రీరామదూతయగు హనుమంతుని వాలమున కాముష్కిక్కుడిరక్కసు లగ్నిఁదగుల్చుటెందులకు? అతని కేమిమోసము సంఘటిల్లునోకదా!—అగ్నిదేవుఁడా! వడి నాచెలిఁబావ నా జీవితేశుఁడు సముద్రము దాటివచ్చునేని, సత్యభాషావిశేషుఁడై అతిపుణ్యచరితుఁడై నాపతియొప్పునేని, సాధ్వినై, జగన్నుతనై, గురుల కెమలిక శుశ్రూష నేను జేయుదాననేని, నీవునాపైఁ గృపాన్వితుఁడవేని శ్రీరామభక్తుఁడైన యామారుతాత్మజునకు శైత్యకారివగుము.

(త్రిజట ప్రవేశించి)

జానకీ! యింక నీవు దుఃఖించుటెందులకు? హనుమంతునితోఁ కకు దుష్టరాక్షసులు నిప్పంటించుటయైనది. ఆమహాబలుఁ డింత నా క్రూరులకుఁ జిక్కకుండపోయి వరుసగా నీలంకలోఁ గొంపలన్నియు ముట్టించుటయైనది. ఇప్పుడు లంకాదహన మగుచున్నది.

సీత—త్రిజటా! ఆంజనేయుఁడు సుఖుఁడేనా?

త్రిజ—జానకీ! సుఖుఁడే! అదుగో యిప్పుడే యిక్కడకు వచ్చుచున్నవాఁడు.

(హనుమంతుఁడు ప్రవేశించి)

హను—తల్లీ! నమస్కారము. (అని మ్రొక్కును)

సీత—మారుతీ! యెంతెంత సాహసకార్యము లొనరించితివి! నీ పరాక్రమ మపవక్రము. నీశౌర్యధైర్యము లమోఘములు. నీబల సామర్థ్యము లత్యద్భుతములు. నీకెల్లప్పుడు జయమగుఁగాక!

హను—తల్లీ! లంకాదహనకాలమున నీకేమియుప్వ వాటిల్లినదో! దైవమా! శ్రీరామచంద్రునకే ద్రోహముఁ జేసినవాడనైతిని కదా! యని మిగులఖేదపడితినిగాని దైవ మనుకూలించినాఁడు. పతివ్రతామతల్లీ! నీకేమియుఁ గష్టముకలుగలేదుకదా!

సీత—మారుతీ! లేదు. లేదు. "పాపీ చిరాయుః" కదా!

హను—తల్లీ! పెనువిపత్తులఁ బడినప్పు డెట్టివారికైనఁ బ్రాణములపై నాశయుండకపోవుట సహజముకదా!

సీత—హనుమంతా! ఎట్లులైన నింక నొకనెలదినములు మాత్రమే శ్రీరామచంద్రునిరాకకై యెదురుఁజూచుచు ప్రాణములతో నుండెదను.

హను—జానకీ దేవీ! నే నిప్పుడేపోయి శ్రీరామలక్ష్మణులకు నీవృత్తాంతముఁదెలిపి, దశకంఠుని సంహరించుటకు వానరబలములతోఁ బ్రయాణముఁగావించి కార్యము సాధింతును. అచిరకాలములో నిన్నింక నీపతివచ్చి కొనిపోవఁగలఁడు. విచారము మాని యుండుము.

సీత—ఆంజనేయా! నీవు సద్గుణసంపన్నుఁడవు. నీ ఋణము మాత్రము మేమెన్నటికిఁ దీర్చుకొనఁజాలము.

హను—తల్లీ! నేను మీకు సేవకుఁడను. లోకజననివగు శ్రీయాది లక్ష్మివి,—ఆ జనకమహాచక్రవర్తి చేసుకొనిన పుణ్యమున నతిగారాబుపుత్రికవై లభియించి, శ్రీ మహావిష్ణువైన రాఘవేశ్వరునకుఁ బత్నివై, సాధుశీలవై—జగత్త్రయస్తోత్రవై— నిఖలజనరక్షణ భారము వహియించిన కరుణాసమేతవు; మునుఁ గుశధ్వజుని తపఃఫలంబున వేదవతియను నామంబుతో నాతనికిఁ దనూజవై, యీక్రూరరావణునిచే భంగింపఁబడి, శపియించి వీని కిప్పుడు మిత్తివై జగమున నవతరించిన పవిత్రచారిత్రవు. ధరిత్రీజాతా! నీ సౌశీల్యము—నీ మహిమము నాబోంట్లు వర్ణింపఁగలరే?—సీతామహాదేవీ! సర్వము నీయందు లేదా? మీ దయయున్న నేను ధన్యుఁడనుకానా?

(అని చుట్టుతిరిగి నమస్కరించి)

తల్లీ! సెలవొసంగిన పోయెదను.

సీత—మారుతీ! శ్రీరామలక్ష్మణుల మాత్రము వేగరమే వచ్చి నన్నుఁగాపాడు మనుము. నా పాతివ్రత్యమహిమచేతను, శ్రీ రాఘవేశ్వరుని కరుణావిశేషముచేతను, నీ కెల్లప్పుడు జయమగుఁగాక! హనుమంతా! యిఁక నీవు పొమ్ము.

హను—మాతా! పోయెదను.

(అని నిష్క్రమించును.)

( తెఱపడును.)

---



శ్రీరస్తు.

# శ్రీ రామపట్టాభిషేకము

---o---

## షష్ఠాంకము

### రంగము ౧

ప్రదేశము:—మాల్యవంతప్రాంతము.

(సుగ్రీవుఁడు, రాముఁడు, లక్ష్మణుఁడు, హనుమంతుఁడు, అంగదుఁడు, జాంబవంతుఁడు, నలుఁడు, నీలుఁడు, వానరసేన ప్రవేశింతురు)

సుగ్రీ—శ్రీరామచంద్రా! హనుమంతుఁడు ప్రతికార్యమునకు సమర్థుఁడుకదా!

రామ—కపిరాజా! ఆంజనేయునకు సాటివారెవరు?—

లక్ష్మ—మారుతీ! సీతామహాదేవి వృత్తాంతము సవిస్తరముగాఁ జెప్పవైతివే?

హను—(దుఃఖముతో) మహాభాగులారా! ఏమిచెప్పుదును? జనక మహాచక్రవర్తియంతటివాని కనుఁగుఁగూతురై, దిగంతయశో విశాలుఁడైన దశరథభూపాలునకుఁ బెద్దకోడలై, సాక్షాద్విష్ణు వంశ సంభూతులైన శ్రీరాఘువేశ్వరునకుఁ బత్నివై, సాధ్వీమ తల్లియై, సర్వజగద్వంద్యయైన యా జానకీదేవి యెుగచాట్లు—ఆ దశకంఠుని క్రూరత్వము—ఆ రాక్షసాంగనల మూర్ఖత్వముఁ జెప్ప

కక్కయా? రాజాంతఃపురముల హంసతూలికలు దిగక, సకల దాసదాసీజన సపర్యలు జరుగుచుండ నయోధ్యాపురీరాజ్ఞియై, సౌఖ్యము లందవలసిన సుకుమారి, కటకటా! ఆ లంకాపుర ములో—ఆ యశోకవనములో, ప్రచండపు టెండలకై ననేమి ప్రళయకాలపు వర్షములకైననేమి, నిర్భాగ్యయై—నిరాధా రయై, పడరాని యిడుమలఁబడుచు, నన్నపానీయములు లేక యలసి, "హా! నాథా! ఎన్నటికైనఁగాని యీ క్రూరరావణుని సంహరించి యీదీనురాలి యాపదఁ బాపెదవే?" యని చిం తిల్లుచు, చెడుగు దశగ్రీవుని చేష్టలకు భీతిల్లుచు, దుష్టరాక్ష సాంగనల సాహసములకు మూర్ఛిల్లుచు, నిఁక నొక నెలదిన ములు మాత్రము గడువుఁబెట్టుకొని, శ్రీరామచంద్రా! సీతా మహాదేవి నీకై యెదురుచూచుచున్నది. గడువుదినములో పలనే నీ వా పతివ్రతామతల్లినిఁ గాపాడవేని యాత్మహత్యకు సంసిద్ధయై యున్నది. ఆ జానకీదేవి దురవస్థఁదలఁచుకొనుచున్న నాహృదయము కఱఁగుచున్నది. ఆ రావణుని చర్యలు విచా రించుకొనుచున్న నాకుఁ గోపము నెత్తికెక్కుచున్నది. రామ చంద్రా! మీ యాజ్ఞలేదని యూరకుంటినిగాని, లేనియెడల నా రావణుని, నా రక్కసులను, నా లంకారాజ్యమును, నొక్క త్రుటికాలములో ధ్వంసముఁ గావించి, వాడని పుష్ప మాలవలె సీతామహాదేవినిఁ గొనివచ్చి మీకర్పింపనే?

అంగ—మారుతీ! నీవంతటి పనికి సమర్థుఁడవు.

జాంబ—ఆంజనేయా! యింక నా లంకాపురీవిశేషము లేమి?

నలు—అప్రతిహత పరాక్రమ సంపన్నుఁడవగు నీ వా లంక యంతయుఁ గలయఁ దిరిగి రానివాఁడవే?

నీలు—సమర్థులు సాధింపఁజాలని కార్యము లుండవుకదా!

హను—మహాత్ములారా! శతయోజన విస్తీర్ణమైన సముద్రమును లంఘించి శత్రుజనముల కభేద్యమైన యాలంకాపురముఁ బ్రవేశించి, జానకీదేవికై, దశగ్రీవుని క్రీడాగృహముతోఁ గూడ దత్పురమందుఁగల గృహములన్నియుఁ గలయఁజూచితిని. కాని యా సాధ్వీమణి నాకెందును గానరామిఁ జింతిల్లి యుద్యాన వనములఁ బరికించుచుఁ దుద కశోకవనమున నొక శింశుపా వృక్షముక్రింద చుట్టు రాక్షసాంగనలు మూగి బాధించుచుండ దుష్టరావణుఁడేగుదేరి దుర్భాషలాడుచుండ, విషాదస్వాంతయై యేమఱక శ్రీరామచంద్రునిం దలఁచుకొనుచు కాల మెట్లో కడపుచున్న సీతాదేవిని కనుచూచునప్పటికి, నాహృదయము నీరైపోయినది. అంత సమీపవృక్షమున దరుశాఖలఁ గూర్చిరరాక్షసాధిపతి కదలిపోవునంతవఱకు చుట్టుమూగియున్న రాక్షసాంగనలు సురాపానముచే మైమఱచి పడిపోవునంతవఱకు డాగియుండి పిమ్మట జానకీదేవికి నేను శ్రీరామదూతగా నమ్మికఁ బుట్టించి రాఘవేశ్వరుఁ డొసంగిన ముద్రిక నొసంగి యా జగజ్జనని వినిపించిన కాకాసుర వృత్తాంతంబు గ్రహియించి శిరోమణిఁ గొని యశోకాది సుందరోద్యానవనముల ధ్వంసముఁ గావించి యెదుర్కొనిన రాక్షస వీరులనెల్ల సంహరించి, మేఘనాదునిబ్రహ్మాస్త్రమునకు బద్ధుఁడనై, దశవదనుని కొలువు కూటమునకేగి నీతులఁ గఱప, నాతఁడు కినుకఁ జెంది నన్నుఁ జంపు మని రాక్షస వీరుల కాజ్ఞాపింపఁ బరమదయాళుండును సద్గుణ సంపన్నుండును ధర్మమార్గప్రవర్తకుఁడు నగు విభీషణుఁడు—పంక్తికంధరుని తమ్ముఁగుఁదమ్ముఁడు "దూతను జంపించుట మహాపాతక"మని యన్నకు హితములఁదెలిపి యా యుగ్రశాసనము దప్పించిన రావణుఁడు "తరుచరునకుఁ బ్రియకరమైన వాలమున కగ్నిఁ దగిల్చి నక్తంచరులందఱు చూడఁగా నీలంకాపురీ వీధులఁ ద్రిప్పుఁ"డని రాక్షసుల కాజ్ఞాపించిన వారటులఁ జేయ దొడఁగిరి. నేను నావాలమున కసురు లగ్నిఁదగుల్చునంత వఱ

కూరకుండి పిమ్మట వారలకుఁ జిక్కకుండఁ బైకెగసిపోయి లంకా దహనముఁ గావించి సముద్రమునఁ దోఁకఁ జల్లార్చుకొని మరల సీతాదేవిని దర్శించి వచ్చితిని. రఘురామచంద్రా!

రాము—(సంతోషముతో) మారుతీ! నన్నుఁ గూర్చి కదా నీవింత భక్తి పూర్వకముగా శ్రమపడితివి!

లక్ష్మ—ఆంజనేయుని ఋణము మనము వేయి జన్మములకైనఁ దీర్చుకొనఁ గలుగుదుమా?

సుగ్రీ—రాఘవా! యిఁకముందు మనము చేయవలసిన పనినిఁ గూర్చి యాలోచింపుఁడు.

హను—ఆలోచనయేమున్నది? కపిరాజా! సంగ్రామముఁ బూని పంక్తి గ్రీవునిఁ జెండాడుట; జానకీదేవి చెఱఁబాపుట.

అం—సంగ్రామమునకు వానరబలములతో నా సముద్రమును దాటవలదా? ఎట్లు?

జాంబ—సేతుబంధనఁ గావింపవలయును.

నలు—ముం దాప్రయత్నము మీఁదనే మన ముండవలయును.

నీలు—పంక్తికంధరునకుఁ దెలియకుండ మన మచిరకాలములో వారధి గట్టవలయును. ఆ క్రూరాత్మునకుఁ దెలిసిన నేమేని యంతరాయములఁ గల్పించును.

రాము—సుగ్రీవా! యింక నాలోచింప వలసిన దేమియును లేదు. నీవు వేగిరమే సంగ్రామమునకు వానరసైన్యముల సిద్ధముచేయుము.

సుగ్రీ—రాఘవా! అటులనే చేసెదను.

రాము—అంగదా! నీవు కొంతవానర సైన్యమున కాధిపత్యము వహియించి యుద్ధసన్నద్ధుడవై యుండుము.

అంగ—రామచంద్రా! మీ యాజ్ఞకు బద్ధుడను.

రాము—జాంబవంతా! నీవు వృద్ధుడవైనను సమర్థుడవు. నలుని, నీలునిగూడి నీవుకూడ కొంత సైన్యాధిపత్యము వహింపుము, తక్కిన సైన్యాధిపతులను సుగ్రీవుడు నిర్మించును.

జాంబ
నలు
నీలు } — మహాప్రసాదము.

రాము—హనుమంతా! నీసాహసమున నే నీకార్యము సాధింపవలయును. లంకాపురీ రాక్షసవీరుల సామర్థ్యములు— పంక్తికంఠుని రహస్యములు కనిపెట్టి వచ్చినవాడవు నీవు. ఒక నెలదినములలో మన మా ఖలుడగు రావణునిగూల్చి జానకీదేవిని గాపాడవలయును కదా! నీవు తగినబలమున కధిపతివై నాకు సాయముగ నుండవలయును.

హను—మహాత్మా! నేను మీకు దాసుడను. మీ యిష్టానుసారము ప్రవర్తించెదను.

రాము—సౌమిత్రీ! సంధ్యాకాల మాసన్నమైనది. ఇక బోవుదమా?

లక్ష్మ—అగ్రజా! వెళ్లుదము.

రాము—వానరవీరులారా! పోవుదమురండు.

(అని అందరు నడుచుచుందురు)

[తెరలో]

శ్రీరామచంద్రా! శరణు! శరణు!

రాము—(ఆలకించి) ఆ యార్తనాద మెవరిదైయుండును? లక్ష్మణా!

లక్ష్మ—శ్రీరామచంద్రా! రాక్షసుల పన్నుగడగా నున్నది.

సుగ్రీ—రాఘవా! సౌమిత్రిపలుకులయందు యథార్థమున్నది.

హను—ఈ స్వరధ్వని నే నిదివఱ కెక్కడో వినినట్లుగానే యున్నది.

అంగ—లంకేశుని కృత్యము కాదుకదా!

జాంబ—రావణుని పన్నాగముగా నాకుఁ దోఁచుటలేదు.

నలు—పంక్తిగ్రీవుఁడు సకలకార్య నిర్వాహక సమర్థుడుకాని సామాన్యుఁడా?

నీలు—కానిమ్ము. తెలియునుకదా!

(విభీషణుఁడు ప్రవేశించి)

ఏ పాపాత్ముని జననముచే, మూడులోకములకు క్షేమము నశియింప, ఘోషిల్లుచున్నవో, యే క్రూరదానవుఁడు మదాంధుఁడై, యవతారపూరుషుఁడవగు నిన్ను వంచించి, సాధ్వీమతల్లియగు జానకీదేవి నపహరించుకొనిపోయి యగచాట్లఁ బెట్టుచుండెనో, యారావణుని తమ్ముఁడ—విభీషణుఁడను, శ్రీరామచంద్రా! శరణు కోరుచుంటిని.

చ॥ ఖలుల నడంచి, భక్తులను ♦ గావఁగవచ్చినవాఁడవీవు, నీ
వలనఁగదా తలంప రఘు ♦ వంశము పావనమాయె, ముజ్జగం
బులు నుతియుంప నీభువన ♦ మోహనమూర్తిని దాల్చినావు, నీ
వలఘుఁడ వారయంగ, తర ♦ మా నిను నుతింపఁగ నాకు? రాఘవా!

ఉ॥ కూరిమివచ్చి నీశరణుఁ ♦ గోరుచునుంటిని గావుమయ్య సీ
తారమణా! క్షమింపు, మిలఁ ♦ దాసుడనీకు, మదాంధుఁ డౌచుఁదా
గూరిచెనగ్గు రావణుఁడు ♦ కూడనికార్యముఁజేసి యీగతిఁ
గ్రూరులు నీతిమార్గముల ♦ కున్ జననొల్లరుకారె ధారుణిన్।

మ॥ "ఘనుఁడౌ రాముఁడు మానవుండనుచు వే ♦ డ్కన్ జానకిన్ దెచ్చి రా
వణ! కష్టంబులఁబెట్టుచుంటివిది పా ♦ పం"బంచు బల్ నీతిఁజె
ప్పిన, నన్నాదశకంఠుఁ డుగ్రుఁడయి చం ♦ పింపంగ శాసించి, యే
మని భావించెనొ? యంతఁబొమ్మనియె రా ♦ జ్యంబంధు లేకుండఁగన్.

ఉ॥ సోదరుఁడైననేమి? కలు ♦ షుండు, నధర్ముఁడు, క్రూరుఁడంచు నే
నాదశకంఠునిన్ విడచి ♦ నాఁడను శ్రీరఘురామచంద్ర! యి
మ్మేదిని మిమ్ముఁజేరితిని, ♦ మీ రనుమానముఁ బొందకుండ నా
పైదయఁజూపి ప్రోవుఁడిక ♦ బాపుజన్ముఁ దరింపఁజేయుఁడీ॥

ఉ॥ పుట్టిననాటనుండియును ♦ మూఁడుజగాలకుఁ గంటకుండు, వాఁ
డెట్టి యఘంబుఁజేయుటకు ♦ నేని సమర్థుఁడు, భూమిజాత ని
క్కట్టులఁబెట్టి మీకిటులఁ ♦ గష్టముఁగూరిచెఁ, బంక్తికంఠుఁ డి
ప్పట్టునఁ జావకుండఁడు, ధ్రు ♦ వంబిది నమ్ముఁడు రాఘవేశ్వరా!

శ్రీరామచంద్రా! రావణుని జయించుట మాత్రము సులభసాధ్యమైన పనికాదు. నేను మీపక్షముఁజేరి యాదైత్యేశ్వరుని వధియించుటకుఁ దగినప్రయత్నములఁ జేయనెంచి మీ శరణుగోరుచుంటిని. శ్రీరాఘవేశ్వరా!

లక్ష్మ—(హనుమంతునిఁజూచి) మారుతీ! పంక్తికంఠుని యనుఁగుఁ దమ్ముఁడగు పరమభాగవతోత్తముఁడగు విభీషణుఁ డితఁడే కదా.

హను—మహాత్ములారా! పరమదయాళుఁడు, ధర్మమార్గప్రవర్తకుఁడగు విభీషణుఁ డితఁడే! ఈ మహాభాగుఁడు మనపక్షము చేరిననా రావణుని సునాయాసముగా జయింపఁ గలుగుదుము. శ్రీరామచంద్రా! సంశయములేక శరణుగోరుచున్న యీ విభీషణుని కభయహస్తమిండు.

రాము—అసురకులభూషణా! విభీషణా!

మ॥ ప్లవఁగశ్రేష్ఠులఁగూడి రావణునిఁ జి ♦ వ్వన్గూల్చి, లంకాపురీ
ధవునిన్ జేయుదు నిన్ను, నమ్ముము యథా ♦ ర్థంబింతయున్, దుష్టదా

నవసంహారము కాకమున్నె, గరిమన్ ♦ బట్టాభిషేకంబు గా
రవమేపారఁగఁ జేయువాఁడనిట లీ ♦ లన్నీకు దైత్యేశ్వరా!

ఆ సముద్రప్రాంతమునకు వెళ్ళుదము. రమ్ము.

విభీ—రాఘవేశ్వరా! యిఁక నేను ధన్యుఁడను.

సుగ్రీ—శ్రీరామచంద్రా!

తే॥ గీ॥ శత్రుసోదరుఁ డేతేరి ♦ శరణుగోర
తీవి, లంక నాతనికిఁ గ ♦ ట్టితివి కాని;
పరగ రావణుఁ డరుదేరి ♦ శరణుగోర
శీఘ్రమాతని కేమి యి ♦ చ్చెదవు నీవు?

రాము—కపిరాజా! నీసందియము మదియా!

మ॥ "దురితాత్ముండను, తప్పు జేసితిని, నా ♦ దోషంబు సైరించి యీ
ధరణీజాతను వే గ్రహింపు"మని యా ♦ దైత్యేశుండు విచ్చేసి నా
శరణే గోరిన, నాయయోధ్యను మహా ♦ సంతోష మేపారఁగాఁ
బరగంగట్టుదు, సందియంబుకలదే ♦ భావింపఁ గీశేశ్వరా!

అందఱు—రాఘవేశ్వరా! మేలు. మేలు. మంచిమాటఁ బల్కితివి.

రాము—వానరవీరులారా! యిఁక జాగువలదు. వేగరమే మనప్రయ
త్నము మీఁదఁ బోవుదము. రండు.

(అని యందఱు నిష్క్రమింతురు.)

[తెఱపడును]

## రంగము ౨

### ప్రదేశము:—సముద్రతీరము.

(రాముఁడు, లక్ష్మణుఁడు, విభీషణుఁడు, సుగ్రీవుఁడు, అంగదుఁడు, హనుమంతుఁడు, జాంబవంతుఁడు, నలుఁడు, నీలుఁడు, వానరసేన ప్రవేశింతురు.)

రాము— సౌమిత్రీ! శతయోజనవిస్తీర్ణమైన యీ సముద్రమునకు సేతువెట్లు నిర్మింతుమాయని ప్రప్రథమమున నేను మిగుల నధైర్యమును వహించితినిఁగాని దైవమనుకూలించినాఁడు. విశ్వకర్మ సుతుఁడగు నీ నలుని సాయమున మన మీకార్యమును సాధించితిమి.

లక్ష్మ—నలునిచేతిమీఁదుగా సాగరములోఁ బడవేసిన ప్రతివస్తువు తేలుచుండెడిది. ఆకారణమున మనమింత స్వల్పకాలములో వారధి బంధింపఁగలిగితిమి. రాఘవేశ్వరా! దైవసాయమే లేనియెడల నెవ్వరెట్టి కార్యమును సాధింపఁజాలరుకదా!

విభీ—మహాత్ములారా! అవతారపూరుషుల కసాధ్యములగు కార్యములుండునే!

సుగ్రీ—శ్రీరామచంద్రా! సముద్రుఁ డంతటివాఁడు నీ పరాక్రమమునకు వెఱచి ప్రత్యక్షమై యవిఘ్నగముగ నీ కార్యము నెఱవేర్చినాఁడు.

అంగ—జానకీపతీ! అవతారపూరుషుఁడవగు నీ కసాధ్యమగు కార్యముండునే! నీమహిమంబులు మాబోంట్లు వర్ణింపఁగలరే!

హను—రాఘవేశ్వరా! సముద్రుఁ డేలనో మఱల నేతేరుచున్నవాఁడు.

(సముద్రుఁడు ప్రత్యక్షమై)

రఘుకులతిలకా! పంక్తిగ్రీవునిపై సంగ్రామసన్నద్ధులైన మీకీ దివ్యకవచభూషణాంబరములఁ గానుకగా సమర్పించుకొనుచుంటిని. వీనినిఁ గైకొని నన్ను ధన్యునిఁజేయుఁడు.

(అని యిచ్చును)

రాము—(తీసికొని) సౌమిత్రీ! వీనిని భద్రపఱచుము.

(అని యిచ్చును.)

లక్ష్మ—(తీసికొని) మహాప్రసాదము!

సము—దేవా! మీకు జయమగుఁగాక! సెలవొసంగుదురే!

రాము—మంచిది. పొమ్ము.

(సముద్రుండు నిష్క్రమించును.)

లక్ష్మ—అగ్రజా! మనకిఁకఁ గర్తవ్యంబేమి?

సుగ్రీ—రావణునితో రణమే!

హను—శ్రీరామచంద్రా! రావణానుజుండగు నీ విభీషణుఁడు మంత్రాలోచనాదక్షుఁడు.

జాంబ—రాఘవేశ్వరా! విభీషణుని తలఁపేదియో తెలిసికొనుట మంచిది.

రాము—విభీషణా! దశకంఠునిపై యుద్ధముఁ జేయుటఁగూర్చి నీయభిప్రాయ మెట్లున్నది?

విభీ—దాశరథీ! చతురోపాయంబుల శత్రుని సాధించుట మహీపాలుర కవశ్యాచరణీయముకదా! కాన నర్హుఁడైన వనచరప్రవరు నొక్కరునిఁ బంక్తికంఠునికడ కంపి మఱల సామమున బోధించుట యుక్తమని నేను తలంచెదను.

అందఱు—మహాత్మా! విభీషణుని పల్కులు సమంజసములు.

విభీ—ఏతత్కార్యమునకీ యంగదుఁడే సమర్థుఁడు.

అందఱు—రామచంద్రా! మాయభిప్రాయముకూడ నంతియ.

రాముఁ—అంగదా! రావణునికడకు నీవు రాయబారిగాఁబోయి యా తనికి నావచనములుగా నిట్లు చెప్పుము.

మ॥ "అవనీజాతను సంగ్రహించితివి నీ ♦ యాటోపము న్మాప రా
ఘవుఁడేతేరెడు, మావిభీషణుఁడు లం ♦ కారాజ్యపాలుండు, నా
నవనాథా! యిఁక నైనఁగాని మదిఁజిం ♦ తల్ బూని, యాజానకీ
యువతిన్ దోడ్కొనివత్తువేని యిట రా ♦ మోర్వీంద్రుఁ జేలున్నినున్.

ఉ॥ వారధిఁగట్టుటా యెను ప్ల ♦ వంగగణంబులఁగూడి లంకకున్
ధీరతఁజొచ్చి దైత్యుల వ ♦ ధించుట తప్పదుకాన నంతగా
ఘోరసమీక మేఁ? చెవు ♦ గుల్ వినవొల్లరుగారె నీతులన్
గూరిమిఁజెప్పుచుంటి నిఁకఁ ♦ గొబ్బునసీతను నిచ్చుటొప్పగున్॥

అట్లు కాదేని నిలంకాపురమును, నీ దైత్యగణమును, నిన్నును ధ్వంసముఁజేసి జానకీదేవినిఁ గొనిపోవుట తప్పదు. అంత మహాపాప ద్రవము కలుగకమున్నె యాసాధ్వీమణి నర్పించి నాశరణువేడుకొను" మనుము. అంగదా! నీవీ మాట లనినపిమ్మట నాతని మదోన్మత్తప్రలా పము లాదరసిరమ్ము. పొమ్ము. సుగ్రీవా! సకల సైన్యములఁగూడి నీవు లంకారాజ్యోన్ముఖుఁడవు గమ్ము. మారుతీ! నీవు మాయాయుద్ధనిపుణు లగురక్షోవీరుల రాకపోకల నారయుచుండుము. జాంబవదాదివీరులారా! మీరందఱు మీ ప్రభువగు సుగ్రీవునకు సాయముఁబొండు. సౌమిత్రీ! విభీషణా! ఇఁక మనము పోవుదము రండు.

(అని యందఱు నిష్క్రమింతురు.)

[తెఱపడును]

---

## రంగము 3

### ప్రదేశము—అరణ్యము.

(శుక, సారణుల శిరోజములఁ బెనవైచుకొని సుగ్రీవుఁడు, హనుమంతుఁడు, జాంబవంతుఁడు ప్రవేశింతురు)

సుగ్రీ—(కోపముతో) ఓరోరి! దుర్మార్గులారా! మదాంధులై, యువతార పూరుషులగు శ్రీరామలక్ష్మణులను, ప్లవంగసేనలను మోసగింపవచ్చిన వారలుగా! ఇప్పుడే మిమ్ముల నేమిచేసెదనో చూడుఁడు.

శుక— } కపిరాజా! మమ్మేల బాధించెదరు? లంకేశ్వరుఁడగు రావ
సార— } ణుఁడు శ్రీరామలక్ష్మణుల పరాక్రమము లెట్టివో తెలిసికొని రమ్మని మమ్ములఁబంపినాఁడు. ఇప్పుడు మీతో మేము యుదార్థముఁజెప్పితిమి? మాయపరాధముల క్షమించి మమ్ముల నిఁక విడచిపెట్టుఁడు.

సుగ్రీ—ఏమీ! మిమ్ముల విడచిపెట్టవలయునా! వానరవీరులారా! వీరలకపట వ్యాపారములు మీరందఱు వినుచున్నారలుకదా! లోకారిష్టులగు నీదుష్టాత్ముల శీఘ్రమే కట్టివేయుఁడు.

(అని కోపముతోఁ గొట్టును)

జాంబ—సుగ్రీవా! శరణుగోరుచున్న వీరల నంతగా బాధించుట మనకు పాడికాదు. విడిచిపెట్టుఁడు.

హను—విడిచిపెట్టినంత వీరలవలన మనకేమి మోసముకలుగును?— కపిరాజా! యిఁక వారల క్షమియింపుఁడు.

సుగ్రీ—అటులైన శుకసారణులారా! మిమ్ము క్షమియించితి. మీరిఁక మీప్రభువగు రావణునిఁజేరి నావచనంబులుగా నాతనికిట్లు చెప్పుఁడు.

తే॥ గీ॥ పుడమి శ్రీరాముఁ డవతార ♦ పూరుషుండు
మించి యాతని కెగ్గుఁ గా ♦ వించితీవు,
శరణుజొచ్చిన వేగ భూ ♦ జాతఁ దెచ్చి
బ్రతికిపోదువు నిశ్చింతఁ ♦ బంక్తికంఠ!

అట్లుకాదేని శ్రీరామునిచేతిలో మరణము నిక్కమని చెప్పుఁడు.

హను—అసురాధములారా! నాపలుకులఁగూడఁ జెప్పుఁడు. "నీలంకాపురమందుఁగల రక్కసుల నొక్కట నుక్కడంచి నీకు నీతులఁ గఱపి తత్పురీదహనముఁ గావించిన హనుమంతుని యెఱిఁగియే యుందువు. అట్టివారలు శ్రీరామచంద్రుని కెందఱో గలరు. కావున నింకఁ గొంతకాలము బ్రతుకదలచినఁ వాఁడవైన సంశయింపక యాజానకీదేవినిఁ గొనివచ్చి శ్రీరాఘవేశ్వరునకర్పించి శరణువేఁడుము. ఆర్తజనశరణ్యుఁడగు నాభగవానుఁడు నీవిభీషణునివోలె నిన్నుఁగూడ కాపాడును."

జాంబ—నక్తంచరులారా! "శరణుజొచ్చిన విభీషణునకు లంకాపట్టముఁగట్టినాఁడు. నాకేమిచ్చునని సందేహించునేమోకాని మీరావణుఁడు, శ్రీరామచంద్రుని యయోధ్యాపుర మిచ్చు" నని చెప్పుఁడు. పొండు.

శుక
సార } —అటులనే చెప్పెదము. మహాత్ములారా! పోయెదము.

అందఱు—బ్రతికిపోయితిరి. పొండు.

(అని యందఱునిష్క్రమింతురు)

[తెఱపడును]

———

## రంగము ర.

### ప్రదేశము— లంకాపురీరాజసౌధము.

(రావణుఁడు, కుంభకర్ణుఁడు, ప్రహస్తుఁడు, ఇంద్రజిత్తు, ధూమ్రాక్షుఁడు, మహానాదరుఁడు, అతికాయుఁడు మున్నగు రాక్షసులు ప్రవేశింతురు.)

రావ—మంత్రీ! ప్రహస్తా! ఆశ్చర్యముగా నున్నది కదా! పొట్టకూటికి గతిలేక కాననంబులఁ గందమూలాదుల మెక్కుచు జీర్ణకాషీ నమాత్ర విభవోపేతులై బ్రతుకుచున్న రామ లక్ష్మణులు కిష్కింధాధిపతినిఁ జంపి సుగ్రీవాది వానరులతో వచ్చి వారధి గట్టి మనమీఁదఁ యుద్ధమునకు లంకాపురముఁ బ్రవేశించు చుండిరఁట! మన కిప్పుడు కర్తవ్య మేమి?

ప్రహ—దశగ్రీవా! కోతిమూకలతో రామలక్ష్మణులు వచ్చి మాత్రము మనల నేమి సేయఁగలుగుదురు?

కుంభ—లంకేశ్వరా! శ్రీరాముఁడు శ్రీమహావిష్ణువు. సీతామహాదేవి పరమసాధ్వీమణి, సాక్షాల్లక్ష్మీస్వరూపురాలు. పితృవాక్య పరిపాలనార్థమై ఘోరారణ్యసీమ కేగుదెంచి యెటులో కాలము వెడలఁబుచ్చుచున్న శ్రీరామలక్ష్మణుల నకారణముగ వంచించి జానకీదేవినిఁ గొనివచ్చి చెఱఁ బెట్టుచుంటివి. మదాంధులై యకారణముగ శ్రీరామలక్ష్మణులతో వైరముఁ బెట్టు కొని మున్ను మన ఖరదూషణాదు లేమి బాగుపడిరి? విషమ బుద్ధితో నామహాత్ములను మోసగించుటకు వెడలిన మనపూర్వ ణాఖ గతి యేమైనది? ఇన్నియేల? నీవైన బాగుపడఁదలఁచిన వాఁడవేని నిరశనైన జానకీదేవినిఁ గొంపోయి యాదాశరథి శరణు వేడుకొనుము. కృపాళుఁడగు నాభగవానుఁడు నిన్నుఁ దప్పక గాపాడును.

రావ—(కోపముతో) ఛీ! ఛీ! ఏమిరా నీమాటలు! ఆ విభీషణుఁ డేమైన బోధించి పోయినాఁడా? అంతగా యుద్ధములో నీవు నాకుఁ దోడ్పడఁజాలకపోయిన, పోయి నీశయ్యాగృహమున నిదురఁ బొమ్ము. కాని యీలాటి ప్రసంగము లిఁక నాకడఁ దెత్తువేని నీకుఁ గూడ తప్పక విభీషణునిగతియే పట్టును.

కుంభ—(తనలో) నా కతిప్రసంగ మేల? ఎటులో వీని కా రామునిచేతి లోనే మరణమున్నది. నాహితములు వీని కిప్పు డేమి రుచియించును? పోనిమ్ము.

ఇంద్ర—తండ్రీ! క్షాత్రశౌర్యములఁ గోల్పోయి యరణ్యప్రదేశములఁ దలఁ దాచుకొనుచున్ననరులు— వారలకు సాయముగా నున్న వానరులు మనల జయించుదురే? సేతువుఁ గట్టి లంకఁ జొచ్చిన మాత్రమున వారలకు మనము భయముఁ జెంద వలయునే?

ధూమ్రా—దానవేశ్వరా! కుంభకర్ణ మేఘనాద ప్రహస్తాతికాయ ధూమ్రాక్ష మహోదరాద్యనేక దానవవీరులచే నిండియున్న యీదైత్యరాజ్యంబు నా నరవానరులు ప్రవేశించి బ్రతికి పోవుదురే?

మహో—సురాసుర గరుడ గంధర్వోరగ గాజేయ వరప్రసాదులగు మిమ్ము మల్లోక విజయుఁడైన యీ యింద్రజిత్తుని జయింప నానరవానరులకు సాధ్యమా?

అతి—(తనలో) ఆహాహా! ఏమి వీరి ప్రగల్భములు. వీరి వోలె నేను కూడ యిప్పు డీరావణునే కొనియాడవలయును. లేని యెడల నీ దుర్మార్గుఁడు నన్నుఁ జంపి వేయును. (ప్రకాశముగా) వక్తంచ రేశ్వరా! సంశయములేల? ధర్మమార్గప్రవర్తకు లగువారికి జయంబు తప్పదుకదా!

రావ—అవును. అఖండపరాక్రమసంపన్నుండనై యనిమిషులఁగొట్టి పలువిజయంబులఁ గాంచిన నన్ను, ముల్లోక భయంకరులగు మదక్షౌహిణీపతులను జయించు దక్షుఁడెవఁడు?

(శుక, సారణులు ప్రవేశించి)

పంక్తికంధరా! భవత్సేవకులమగు శుక, సారణులము నమస్కరించుచున్నారము.

రావ—వార్తలేమైనఁ గలవా?

శుక—దైత్యేశ్వరా! నరవానరులు వారధిఁగట్టి లంకఁబ్రవేశించుచున్న మాట వాస్తవము. ఆ వానరబలమును లెక్కింప బ్రహ్మకైనఁ దరముకాదు. శ్రీరామచంద్రుఁడు విభీషణునకు లంకారాజ్యము దానముఁజేసియున్నవాఁడు. ఆ వీరు లెల్లరు యుద్ధమునకు సంసిద్ధులై యున్నవారలు.

రావ—(కోపముతో) రాముఁడు విభీషణునకు లంకారాజ్యము దానముఁ జేసియున్నవాడుగా! మంచిది. కానిమ్ము. ఇంక వార్తలేమి?

సార—దేవా! ఏమిచెప్పుదుము? మేమిరువుర మిక్కడనుండి పోయి సుగ్రీవునకుఁ జిక్కితిమి. ఆ ప్లవంగేశ్వరుఁడు మమ్ముల నానా విధముల హింసించి తుద కెట్లెట్లో తక్కిన వానరవీరులు దయదలఁచినందున విడిచిపెట్టినాఁడు. మీకా సుగ్రీవుఁడు తెలియఁబఱచిన మాటలఁ జెప్పెదము.

("పుడమి శ్రీరాముఁ డవతారపూరుషుండు" అను పూర్వోక్త పద్యమును చదువును) "అట్లుకాదేని శ్రీరామచంద్రుని చేతిలో మరణము నిక్కువ"మనియెను.

రావ—(కోపముతో) ఏమీ! సుగ్రీవుని పలుకులా యివి?

శుక—పంక్తికంధరా! అంజనీపుత్రుఁ డిట్లుపలికినాఁడు. "నీలంకాపురమందుఁగల రక్కసుల నొక్కట నుక్కడంచి నీకు నీతులఁ గఱపి తత్పురీదహనముఁ గావించిన హనుమంతుని యెఱిఁగియే యుందువు. అట్టివారలు శ్రీరామచంద్రున కెందఱోగలరు. కావున నింకఁ గొంతకాలము బ్రదుకఁదలఁచిన వాఁడవైన సంశయింపక యీ జానకీదేవిని గొనివచ్చి శ్రీరాఘవేశ్వరుని కర్పించి శరణు వేడుము. ఆర్తజనశరణ్యుఁ డగు నా భగవానుఁడు నీ విభీషణుబోలె నిన్నుఁగూడ గాపాడును."

రావ—(కోపముతో) ఏమిరా! వానిపొగరు? ఆవిభీషణుని మాలము ననే వాఁ డిక్కడనుండి మున్ను బ్రతికిపోయినాఁడు. కానిమ్ము.

సార—దశగ్రీవా! వయోవృద్ధుఁడగు జాంబవంతుఁడు "శరణుజొచ్చిన విభీషణునకు లంకాపట్టముఁ గట్టినాడు. నా కేమిచ్చునని సందేహించునేమోకాని మీరావణుఁడు శ్రీరామచంద్రుని యయోధ్యాపురమిచ్చు"నని చెప్పినాడు. దేవా! నరవానరుల ప్రతాపము లిట్లున్నవి.

రావ—(కోపముతో) ఏమి! ఏమి! ఆవృద్ధభల్లూకమునకుఁగూడ యింత పౌరుషముఁవచ్చినదిగా! మీరేమని వచ్చితిరి?

శుక—
సార— } రాత్రించరేశ్వరా! యిఁక మేమక్కడ యేమనుట కేమున్నది? బ్రతికితిమిక నా యని సంతసమున వచ్చితిమి.

రావ—(కోపముతో) ఛీ! ఛీ! అసురాన్వయ పరిపూర్ణ కళంక కారణ కలుషాత్ములారా! యింతటి హేయంబులగువాక్యంబులు నాతోఁ జెప్పుటకు బ్రతికివచ్చితిరా? దైత్యకులంబులో నెంతటి పిరికిపందలు పుట్టితిరి? ఇఁక నాయెదుట నుండకఁ బొండు.

(శుక, సారణులు నిష్క్రమింతురు)

రావ—రాక్షసవీరులారా! వింటిరా వానరులపలుకులు?

ప్రహ—లంకేశ్వరా! మాటలతోఁ బ్రయోజనమేమికలదు?

(తెరలో)

రాత్రించరేశ్వరా! ప్లవంగశేఖరుఁడొక్కఁడు భవద్దర్శనార్థమై వచ్చియున్నవాఁడు.

రావ—శీఘ్రమే లోపలకుఁ బ్రవేశపెట్టుము.

(అంగదుఁడు ప్రవేశించి)

(తనలో) ఆహా! యీదశకంఠుని వైభవమేమి? శ్రీరామచంద్రుని సందేశంబు ఖండితంబుగాఁ జెప్పుటకన్న యీదుష్టునితో సాకతి ప్రసంగమేల?

ప్రహ—(తనలో) వీఁడెవ్వఁడైయుండును?

ఇంద్ర—(తనలో) ఇచ్చటకేమి కార్యార్థియై వచ్చినాఁడో!

ధూమ్రా—(తనలో) వానరులింత నిర్భయముగాఁ బంక్తికంఠుని రాజ్యంబున నడుగిడుటకలదే?

మహో—(తనలో) లంకనుఁ దగులబెట్టిపోయిన దుష్టవానరుఁడు కాదుకదా!

అతి—(తనలో) ఈతఁడెవ్వఁడో శ్రీరాముని పనుపున రాయబారిగా వచ్చినట్లున్నాఁడు.

రావ—ఓరీ! వానరాధమా! నీవెవఁడవు? నిన్నిచ్చటకుఁ బంపినవార లెవరు? ఏమిపనిఁబూని వచ్చితివి?

అంగ—రాత్రించరేశ్వరా?

మ॥ తనవాలంబున బల్మిఁజుట్టికొని, వింతలన్ వార్ధులన్ నిన్నుముం
 చిన నావాలిసుతుండ, నంగదుఁడ, నా శ్రీరామదూతన్ మహీ

జనువేడ్కగా గొనివచ్చియుంటివిపుడే ♦ సంగ్రామమే రూఢీ నా
శనమైపోయెదవంతయేల? వినుమీ ♦ సందేశ మో రావణా!

ఆర్తజనశరణ్యుఁడు కాన శ్రీరామచంద్రుఁ డింకను జాలివహి
యించి నీకీసందేశమంపెను. ఆతని వచనంబులఁ జెప్పెద నాలింపుము.

(అని "అవనీజాతను సంగ్రహించితివి" వారధిఁగట్టుటాయెను
ప్లవంగ గణంబులఁగూడి" అను పూర్వోక్తపద్యములఁ జదువును)

అట్లు కాదేని నీలంకాపురమును నీదైత్యగణమును నిన్నును ధ్వం
సముఁజేసి సీతాదేవినిఁ గొనిపోవుటతప్పదు. అంత మహాపద్రవము
కలుఁగక మున్నె జానకీదేవి నర్పించి నాశరణువేఁడుకొను" మనియెను.

దానవేశ్వరా! యిప్పటి స్థితినిఁ బట్టి నీవిఁక నటులఁ జేయక
తప్పఁదు. అవతారపూరుషుఁ డగు రాఘవుని శరణుగోరి సఖ్యముఁ
జేసికొనుట నీగౌరవమున కెంతమాత్రము హానికాదు. విభీషణునివలె
నాభగవానుఁడు నిన్ను తప్పకఁ గాపాడును. శరణుగోరిన నీ తమ్మునకు
లంకారాజ్యము దానముచేసిన నీకాతని యయోధ్యా పురంబర్పించు
ను. ఎఱుఁగకఁ జేసిన నీయీ దోషము నా కృపాళుఁడు సైపఁగలఁడు.
నక్తంచరేశ్వరా! బాగుగా నాలోచించుకొనుము.

రావ—(కోపముతో లేచి) ఛీ! ఛీ! మర్కటాధమా! ఏమిరా, నోటికి
వచ్చినట్లెల్లఁ బ్రేలుచుఁటివి. శ్రీరామ దూతయగువానినిఁ జం
పించుటయే నాకు శ్రేయస్కరము. పరమదుర్మార్గుడగు విభీ
షణుని మూలమున మున్ను హనుమంతుఁడు బ్రతికి పోయిన
వాడుకాని నీకిప్పుడిం దడ్డుపడు వారలెవ్వరును లేరు. (అనిభటు
లవంకఁజూచి) వీరులారా! చూచెదరేల? ఈ కోతిపానినిఁ బట్టు
కొని చంపి వేయుఁడు.

అం—(కోపముతో) ఛీ! క్రూరాత్మ! నీకంత్యకాల మాసన్నమైనది.
రోగికిఁ బథ్యపదార్థంబులవలె మాహితములు నీకిప్పుడు రుచి

యించునా? పోనిమ్ము, వినకపోయిన నీవే చెడిపోయెదవు. శ్రీరామదూతలనుఁ జంపింతునని కంకణముఁ గట్టుకొనియున్న రాక్షసవీరుఁడవా నీవు? ఈ నీప్రగల్భము లాహనుమంతుఁడు మున్ను నీలంకాపురమంతయుఁ దగులబెట్టు నప్పుడేమయినది? వేగిర పడకుము. ఇక నచిరకాలములో నాశ్రీరాముఁ డరుదేరి నీరూపు మాపును.

ప్రహ — రాక్షసులారా! వీనినిఁ బోనీకుఁడు, చుట్టూఁ గ్రమ్ముకొనుఁడు!

ఇంద్ర — వీడెంత? వీని నొక్కనిఁ జంపుటకు నలువురము కావలయునే? ధూమ్రాక్ష మహోదరులారా! మీరిరువురు వీనిపనిబట్టలేరా?

ధూమ్రా / మహో — ఒక్క ఘటికాలములో వీనిని యమపురికిఁబంపమా?

(అని చుట్టూ మూగుదురు.)

అంగ — (కోపముతో) ఓరీ! దానవాధములారా! రండు, మీ పరాక్రమములఁ జూపుఁడు.

అతి — (తనలో) ఈ ధూమ్రాక్షమహోదరుల చావునకే యీ యంగదుఁడిచ్చట కేగుదెంచినాఁడు. నే నీకలహములో మాత్ర మెట్టిజోక్యము కలుఁగ జేసుకొనను.

ధూమ్రా — / మహో — ఓరీ! కోతివాడవు, నీవు మాకడ నెంతిరా?

అంగ — (తనలో) ఈ దురాత్ములతో నాకిప్పుడు కలహము పనికి రాదు. శీఘ్రముగా యిందుండి యిఁక శ్రీరామచంద్రునికడకు బోవలయును. (ప్రకాశముగా) నిశాచరాధములారా! రండు. రండు.

(అని యిరువురను గ్రుద్ది నిష్క్రమించును)

ధూమ్రా— } కోతివాడు తప్పించుకొనిపోయినాడు. పట్టుకొనుఁడు,
మహో— } పట్టుఁకొనుఁడు.

అతి—లేకపోయిన మనకాతఁడు వధ్యుఁడగునా?

ఇంద్ర—ఇరువురు కలసి యొక కోతివానినిఁ గొట్టజాలకపోతిరేమి? ఇంతియేనా మీ పరాక్రమములు?

ప్రహ—అయిపోయిన విషయమునుఁ గూర్చి యింక నీతర్జనభర్జన యెందులకు? ఇప్పుడు వాడు తప్పించుకొనిపోయినఁ బోనిండు. ఎప్పటికైన వాడు మనచేతులలోఁ జచ్చువాడే!

రావ—(కోపముతో) ఇందరుండియు వానినిఁ బోనిచ్చితిరేమి?

ప్రహ—దేవా! కానిండు. వానిపని అప్పుడే ఏమైనది? ముందు మనము జరుపవలసిన రణమువిషయమై సాలోచింపుఁడు.

రావ—(శాంతిపడి) మంత్రీ! యిఁక నాలోచన యేమియును లేదు. సంగ్రామమునకు సైన్యంబుల సిద్ధముఁ జేయించి నీవు తూర్పు గవనిం గాచియుండుము.

ప్రహ—చిత్తము. అటులనే!

రావ—మహోదరా! తగిన సైన్యంబులతో నీవు దక్షిణద్వారము కడ నుండుము.

మహో—మహాప్రసాదము!

రావ—ధూమ్రాక్షా! కొంత సైన్యముతో నీవు పడమరదిశం గాయుము.

ధూమ్రా—దేవరయాజ్ఞ పాలించెదను.

రావ—అతికాయా! కొంతబలముతో నీవు మేఘనాథునకుఁ దోడుఁగఁ బొమ్ము. ఇంద్రజిత్తు నుత్తరంబున నుండుము లే!

అతి—(తనలో) నాకుఁగూడ చావుమూడినది. (ప్రకాశముగా) ప్రభువాజ్ఞ నిర్వర్తించెదను.

రావ—దేవియగు మండోదరినిఁ జూచివచ్చి నేనుకూడ మిమ్మల నిప్పుడే కలసికొందును. మేఘనాథా! శీఘ్రమే సమరసన్నాహముఁ గావింపుము.

(అని యందఱు నిష్క్రమింతురు.)

[తెఱపడును]

---

రంగము ౫

ప్రదేశము—అంతఃపురము

(రావణుఁడు, మండోదరి ప్రవేశింతురు)

రావ—కల్యాణీ! యింత యధైర్యమేటికి?

మండో—నాథా! నామాటవినుఁడు. వేగిరఁబడకుఁడు.

రావ—యుద్ధములందుజయాపజయములు దైవాధీనములు. ఐన మాత్ర మారామునితో యుద్ధమన నెంత? నీకెంతమాత్రము భయమువలదు.

మండో—ప్రాణేశ్వరా! నామాటఁ ద్రోసివేయకుఁడు. నేడు నేనొక దుస్స్వప్నముఁగూడఁ గంటిని. అప్పటినుండియు నాకేమియో మిగుల నధైర్యముగానే యున్నది.

రావ—ప్రాణేశ్వరీ! దుస్స్వప్నమేమి?

మండో—మనోహరా! నల్లనివస్త్రములు ధరియించి రక్తసిక్తాంగులై భీకరవికృతాకృతులై, భృశార్తులై లంకాపురవీధుల మీరు తిరుగాడుచున్నట్లు కలఁగంటిని. అప్పటినుండియు నాకుమిగుల వధైర్యముగానున్నది.

రావ—(నవ్వుచు) స్వప్నంబులు నిజంబులా ప్రాణేశ్వరీ!

మండో—(దగ్గరకుజేరి) వేగిరఁబడి మీరా రామచంద్రునితో యుద్ధముఁ కుమాత్రము సాహసింపకుఁడు.

రావ—ముగ్ధహృదయా! ఎంతభీరురాలవు? — అత్యల్ప విక్రములై యన్నపానీయములు లేక నడవుల సంచరించెడు మనుష్యమాత్రులగు రామలక్ష్మణులకు భయముఁజెంది నేను యుద్ధము మానుకొనుదునా? నాపరాక్రమ మెఱిఁగియుండియు నిట్లు పలికెద వేల?

మండో—ఆ నరవానరులు సేతుబంధనఁగావించి లంకాపురముఁజొచ్చియుండిరా?

రావ—అవును. నేనుకూడ సమరసన్నాహముఁ గావించితిని. ఇఁక యుద్ధముఁ జఱుగును.

మండో—మనోహరా! నాపల్కు లాలింపుఁడు. రాఘవుఁ డవతారపూరుషుఁడు. మాయామానవ విగ్రహుఁడు. లోకేశుండగు నాభగవానుని మహిమంబులు మీరు గుర్తింపఁజాలక పరమపతివ్రతామణియగు సీతాదేవినిఁ గొనిదెచ్చి చెఱఁబెట్టుచుంటిరి. సాధ్వీమతల్లియగు నాజానకీదేవిని మీరట్లు బాధించుట మవకు శ్రేయస్కరము కాదు. ఆ వైదేహిని మీరిక్కడకుఁ దెచ్చినప్పటినుండియే యీలంకారాజ్యమునకుఁ గ్రమక్రమముగా హీనస్థితి పట్టుచున్నది. నాథా! పరదారాప

హారణము మహా పాతకహేతుభూతము. అవక్రపరాక్రమ ధురంధరులై - అఖిల సద్గుణసంపన్నులై- అవనీతల రక్షకులై-అవతారమూర్తులై - అజేయులైన యా శ్రీరామలక్ష్మణులతో మీ రకారణకలహమూలమైన సంగ్రామము బూని యధోగతిపాలగుటకన్న జానకీదేవిని యింకనైనఁ గొనిపోయి రాఘవుని శరణు గోరుకొనుదురేని, మి మ్మాభగవానుడుఁ దప్పకఁ గాపాడును. శ్రీరామచంద్రుఁడు కరుణాసింధుఁడు. ఆర్తజనశరణ్యుఁడు, అధర్మ సంహారకుఁడు. పిన్నతనమ్ముననే గాధేయుని యాగమునఁగాచి, రాతిని నాతిగాఁజేసి, యెవ్వరికి నెత్తుటకుఁగూడ శక్యముగాని శివవిల్లు నవలీలవిఱచి జానకీదేవినిఁ బెండ్లాడి, పరశురాముని జయించి కీర్తిఁగాంచిన మహాబలుఁడు. పితృవాక్యపరిపాలనార్థమై రాజ్యాపేక్షవిడచి సోదరుఁడగు వెంటరా బత్నీసమేతుడై, దుర్గమారణ్యభూములఁజొచ్చి యనేకరాక్షసుల సంహారించి మునిజనమ్ములఁగాచిన పుణ్యమూర్తి. జటాయునకు ముక్తినొసఁగి, శబరి భక్తిపూర్వకముగ నిచ్చిన యెంగిలిఫలముల భక్షించి దానికి మోక్షసామ్రాజ్య పదవిఁ జేకూర్చిన పరమదయాళుండు. ప్లవంగ శ్రేష్ఠులతో సఖ్యమొనరించి యతులితబలశాలియైన వాలినిఁ గూలఁద్రోసి సుగ్రీవునకుఁ గిష్కింధాపట్టముఁగట్టి లంకపై దాడివెడలి శత యోజనవిస్తీర్ణమైన సముద్రమును బంధించి శరణుజొచ్చిన విభీషణున కభయహస్తమిచ్చిన ధైర్యశాలి. ప్రాణేశ్వరా! అట్టి రఘురామచంద్రునితో మీకు ఘోరసంగ్రామము వలదు, వలదు.

రావ—(కోపముతో లేచి) ఛీ! ఛీ! కూరాత్మురాలా! ఏమి నీయసంబద్ధప్రలాపములు? పట్టపుదేవివను గౌరవమున నిన్నుఁ గనికరించి నీపైఁగల ప్రేమాతిశయములచే శత్రుని సంహరించు సంతోషమున సంగ్రామమునకు వెడలుచు నీతోఁజెప్పుట కచ్చుట కేగుదేర నా కర్ధాంగివై, నా మేలును గోరవలసిన

దానవై యుండియు, నన్నతిలాఘవముగఁ జూచుచు నాయెను టనే నాశత్రుని నంతగాఁబొగడెదవా? రణరంగమున రాముని సంహరించినపిమ్మట జానకీదేవి నాకు పట్టంపుదేవి యగునని యోర్వలేక యుంటివా? రాఘవుఁ డవతారమూర్తి యని కైవారముఁ జేయుచుంటివే? సృష్టికిఁ బ్రతిసృష్టి సలిపి తనతపోబలముచే నెటులో గాధేయుఁడు యాగముఁ బూర్తికావించుకొనిన చూచుటకు వెంటనరుదేరిన రామలక్ష్మణులుమహాబలులైరిగా! శాప విమోచనకాల మాసన్నమై యహల్య తననిజరూపు ధరియించి నమాత్రముననఁ దత్ప్రాంతమందు ప్రయాణముఁ జేయుచున్న రామలక్ష్మణు లవతారమూర్తులైరిగా! వేలకొలఁది వత్సరముల నుండియు జనకమహాచక్రవర్తి యింటిలోఁ దాఁచి పెట్టఁబడి తుప్పుఁబట్టి పోయిన విల్లును విఱచినంతమాత్రముననను, వివాహకాలమాసన్నమై సీతనుఁ గల్యాణమైన గతముననను, కడు వృద్ధుఁడగు పరశురామునిఁ గొట్టిన హేతువువలనను శ్రీ రాముఁడు మహాబలుఁడయ్యెనుగా? జ్యేష్ఠతనూభవుఁడైనను నన మర్దుఁడగు రాముఁడు రాజ్యార్హుఁడు కాఁడనియు ముద్దుల భార్యయగు కైకేయి పుత్రునిపైఁగల ప్రేమాతిశయముల చేతను, దశరథుఁడీతని వెడలఁగొట్ట లక్ష్మణునిఁ దోడుఁకొని పత్నీసమేతుఁడై కాననంబులఁజొచ్చి యత్యల్పవిక్రములగు వృద్ధరాక్షసుల సంహరించి, మునిజనమ్ములఁ గందమూలాదుల కొఱకు నాశ్రయించుకొనినంతమాత్రమున నారాఘవుఁడు పుణ్యమూర్తి యాయెనుగా! నాకత్తిపోటుచే బక్కములఁ గోలు పోయి క్రిందఁబడి సీతాపహరణవార్తఁ దెలిపి ప్రాణముల వీడిన జటాయును తనకు మేలు చేకూర్చెనని దహనముఁ జేసె గాని, రాముఁడిచ్చిన మోక్షమేమి? అవనీజాలికై నడవులనలసి క్షుద్బాధ కోర్వఁజాలకఁ దిరుఁగుచుండ, వీరిదుస్థితికి జాలి వహించి తానుతినుచున్న యెంగిలిఫలములఁ గొన్నిశబరియీయఁగ నవి యానాటికి భుజియించి బ్రతికితిమని సంతసించుచుఁ బ్రత్యు

వకారమెంత మాత్రమును చేయనేరక, "శబరీ! నీకు మోక్ష సామ్రాజ్య పదవి చేకూరుఁగాక!" యని మాటయనెను గాని యంతమాత్రమున శబరికి మోక్షము కలిగెనా? అందుమూలమున రాముఁడు పరమదయాళుఁడాయెనా? కోఁతిమూకలతో స్నేహముఁ జేయుటయు, చెట్టుచాటుననుండి సమరమున శత్రుఁడగు వాలిని సంహరించి సుగ్రీవునకుఁ గిష్కింధఁగట్టుటయు వరప్రసాదమున వారధి బంధించుటయు, వైరితమ్ముని జేరి తత్పక్షమందలి రహస్యముల భేదించి విభీషణుని కభయహస్తమిచ్చుటయు ధైర్యశాలియగు వానికి లక్షణములా? ఛీ! దుర్మార్గురాలా! యేమిటికి గాను నీ వారాముని యంతగాఁ గొనియాడితివి? ఇఁక నీవు నాకడ నిట్టి ప్రసంగములఁ దెత్తువేని నిన్నీ లంకాపురమునకు బలిగాఁ జేయుదును. భద్రముగ నుండుము.

(అని నిష్క్రమించును.)

మండో—(దుఃఖముతో) హా! విధీ! ఈ లంకాపురమున కింక నెట్టి పాట్లుఁ బెట్టితివో కదా! (అనిలోపలకుఁ బోవును.)

[తెరపడును.]





శ్రీరస్తు.

# శ్రీరామపట్టాభిషేకము

## సప్తమాంకము



### రంగము ౧

ప్రదేశము—లంకాపురవీధి

(మాల్యవంతుడు ప్రవేశించును)

ఆజానకీదేవిని దెచ్చినప్పటినుండియే యీరావణునకు మహా పాతకము చుట్టుకొన్నది. అప్పటినుండియే యీలంకాపుర వైభవము క్రమక్రమముగా క్షీణించుచున్నది. ఆనాటినుండియే దశకంఠునిరాజ్యమున మహోత్పాతములు ప్రారంభమైనవి. సీతామహాదేవి పాతివ్రత్యవిశేషముచేతను, శ్రీరామచంద్రుని పరాక్రమ సంపన్నతచేతను, యిక నీలంకేశుం డధోగతిపాలగుట నిక్కము. సంగ్రామ మారంభమైనదిమొదలుకొని నేటివఱకు విజయులై నరవానరులు క్రమక్రమముగా రాక్షససైన్యముల సంహరించుచుండిరి. ఈదశవదనుం డెవరేమి హితములం దెలిపినను వినఁడు. అయ్యో! యింక నీపురమున కేమి మహాపదవములు సంఘటిల్లునో కదా! (కొంచెమాగి) ఎవరటుపోవుచున్నవారు?—యూపాక్షునివలె నున్నాడే! (బిగ్గరగా) యూపాక్షా! ఇటు, యిటు, యిటు.

(యూపాక్షుఁడు ప్రవేశించును)

యూపా—మహోదరా! ఎక్కడకుఁబోవుచుంటివి?

మహో—ఎక్కడకు లేదు కాని, యూపాక్షా! వృత్తాంతములేమి?

యూపా—ఎఱుఁగుదువుకదా! మనము యుద్ధకాండలోనికి దిగితిమి. రాక్షసవీరులకు, నరవానరులకు ఘోరసంగ్రామము జఱుగుచున్నది. నీవిక్కడనే యుంటివేమి?

మహో—నన్నేమి చేయుమనుచుంటివి?

యూపా—యుద్ధము.

మహో—ఎప్పుడు హాస్యమేనా? యూపాక్షా! ఆఘోరములో నే నేమి చేయఁగలుగుదును? నీవుకూడ నావలె నూరక దిరుగాడుచుంటివేమి?

యూపా—నేను ప్రప్రథమమునుండియు నింతియే! ఇప్పుడేమి యుద్ధముఁ జేయుదును? వృద్ధాప్యముకూడ వచ్చినదికదా! ఇప్పటికైన యుద్ధముఁ జేయవలయునని కోరికయున్నదికాని, నాస్వామి యగు కుంభకర్ణుఁడు నన్నొల్లఁడు.

మహో—పోనిమ్ము. బ్రతికిపోతివి. యూపాక్షా! రణవృత్తాంతములేమైన నెఱుఁగుదువా?

యూపా—నరవానరుల బలము లసంఖ్యాకములై యున్నయవి. వారల పరాక్రమము లత్యద్భుతములు. గట్టిగాఁ జెప్పుకొనునెడల రావణుఁడు బ్రతుకనీయఁడు కాని, రాక్షససైన్యము లప్పుడే చాలవరకు క్షీణించిపోయినవి. మంత్రిప్రహస్తుఁడు, వజ్రదంష్ట్రుఁడు, దుర్ముఖుఁడు, మహాపార్శ్వుఁడు, మహాకాయుఁడు, అతికాయుఁడు, కంపనుఁడు, అకంపనుఁడు, అగ్నికేతుఁడు, రశ్మికేతుఁడు, సూర్యశత్రుఁడు, సుప్తఘ్నుఁడు, మాల్యవంతుఁడు, ధూమ్రాక్షుఁడు, కుంభుఁడు మున్నగు మన దనుజ

వీరులందఱు గతియించినారు. మన యింద్రజిత్తు యిప్పుడు మాయాయుద్ధముఁ జేయుచున్నాడు. స్వామియగు రావణుఁడుకూడ మఱల రణభూమికి వెడలినాడు—జయలక్ష్మి యింతవఱకు నరవానరుల పక్షముననే యున్నది.

మహో—కుంభకర్ణుఁడో?-

యూపా—ఇంకను నిదుర లేవలేదు.

మహో—అట్లైన నాతఁడైన బ్రతికిపోవునులే!

(మకరాక్షుఁడు ప్రవేశించును.)

నరవానరుల ప్రతాపము లడఁగినవి. రాక్షసులకు జయము చేకూరినది. మహోదరా! యూపాక్షా! మీరిరువు రిందుంటిరేమి?

మహో—ఇప్పుడే వచ్చితిమికాని, మకరాక్షా! సంగ్రామవిశేషము లేమి?

మక—ఇంకను మీకు తెలియలేదా? రాక్షసులకే జయము లభించినది.

యూపా—ఎట్లు? ఎట్లు? రాక్షసబలములు చాలవఱకు గతియించినవి కావా? నీవెక్కడనుండి వచ్చుచుంటివి?

మక—నేనెక్కడనుండివైననేమి? రాక్షసులకు జయము చేకూరిన మాటమాత్రము వాస్తవము.

మహో—క్రమక్రమముగా నంతరించిన రాక్షసబలములకు జయ మెట్లు లభించినది?

మక—రాక్షసబలము లంతరించుచున్నప్పుడే మన యింద్రజిత్తు రణరంగమునఁ బ్రవేశించి మాయాయుద్ధము సలిపి, రామలక్ష్మ

ణుల నిరువురను నాగపాశములచే బంధించినాఁడు. ఇప్పుడు
వా రా యుద్ధభూమినిఁ బడియున్నారు. పోయిచూడుఁడు.

యూపా—అటులైన నిది యథార్థమైయుండవచ్చును.

మహిళా—యూపాక్షా! పోవుదమా?

యూపా—వెళ్ళుదము. మకరాక్షా! నీవుకూడ వచ్చెదవా?

మక—వచ్చెదను, రండు.

(అని యందఱు నిష్క్రమింతురు)

[తెఱపడును.]

---

రంగము ౨.

ప్రదేశము - యుద్ధభూమి.

(నాగపాశబద్ధులై రామలక్ష్మణులు మూర్ఛఁబడిపోయియుం
దురు. సుగ్రీవుఁడు, హనుమంతుఁడు, విభీషణుడు, అంగదుఁడు, జాంబ
వదాది వానరవీరులు చుట్టూఁ జేరి దుఃఖించుచుందురు.)

సుగ్రీ—హా! శ్రీరామచంద్రా! ఎంతఘోరము జఱిగినది. అవతార
మూర్తివై అధర్మసంహారకుఁడవై, ఆర్తజనశరణ్యుఁడవై
మహాత్మా! యిట్టియుగచాట్ల పాలైతివేమి? పితృవాక్యపరి
పాలనార్థమై రాజ్యాపేక్ష విడచి పసికూనయగు దమ్మునిఁ
దోడుకొని ముగ్ధహృదయ- పతివ్రతాశిరోమణియగు జాన
కితో దుర్గమారణ్యభూములఁ బ్రవేశించి లోకకంటకులగు
ననేకరాక్షసుల సంహరించి మునిజనములఁ గాపాడిన పుణ్య
మూర్తివికదా! మహాత్మా! యేయొక్కమునిమైన నిచ్చేసి
నీకీయాపదఁ బాపఁడేమి? రాఘువేశ్వరా! నీవుజేసిన యుపకా
రములు నప్పుడే యీభూలోకమున నెల్లరు మఱచిపోయిరా?

సర్వజగద్రక్షకుఁడవే! సత్యభాషావిశేషుఁడవే! శరణాగతవత్స లుఁడవే! సమస్తశస్త్రాస్త్రవిద్యాప్రవీణుఁడవే! దాశరథీ! నీవి నాగాస్త్రమునకెట్లు బద్ధుఁడవైతివి? పడరానియిడుములఁబడుచు నా యశోకవనమున భవద్విజయమునుగోరి నీరాకకై యెదురు చూచుచుండు నాసీతామహాదేవి కీకర్ణకఠోరమగు వార్త తెలిసిన నింకబ్రతుకునే? ఇఁక నొక నెలదినములుమాత్రము గడు వుబెట్టుకొని యుటులో కల్పములుగ వెడలబుచ్చుచు నీకై యెదురుచూచుచున్నదికదా యీసాధ్వీమతల్లి! హా! రామ చంద్రా! శ్రీరామచంద్రా! (లక్ష్మణునిఁజూచి) సౌమిత్రీ! ఎట్టి విపద్దశ సంప్రాప్తించినది? భ్రాతృసేవాపరుఁడవు, పరమదయా ళుఁడవు మహాత్మా! యేమిదురవస్థలో నుంటివి? రాఘవేంద్రుని పైఁగల ప్రేమాతిశయముల చేతనే కదా నీవుకూడ యయోధ్య నువీడి, సుఖములఁ బాఱదోలి, పత్నినెడబాసి, పలుశ్రమ లందుచు నిద్రాహారముల వర్జించి నిరంతరజాగరూకుఁడవై సీతారాములకు శుశ్రూషలుసలుపుచు ఘోరకాంతారవాస ముఁ జేయుచుంటివి! మాయాయుద్ధనిపుణుఁడైన యీ యింద్ర జిత్తుని సంహరింతువని మేమందఱ మూహించితిమికాని, యీతని నాగాస్త్రమునకు నీవిట్లు బద్ధుఁడవయ్యెదవని కలనైనఁ దలంపమైతిమికదా! నిరుపమానభ్రాతృవత్సలుఁడవై, నిర్మ లాంతఃకరణుఁడవై, నిరంతరజాగరూకుఁడవై ప్రవర్తించుచున్న నీకిప్పు డీనిద్రావస్థ యెట్లు సంభవించినది? లక్ష్మణా! నీకే యననేల? విశ్వప్రపంచకంబంతయు నిప్పుడు నిద్రావస్థలోనే యున్నది. నిరంతర రామనామస్మరణామృతపాన మత్తుండవై కదా మహాత్మా! యిప్పుడు నిరుత్తరుఁడవైయుంటివి. మహా భాగులారా! యీప్లవంగశ్రేష్ఠుల నందఱి నొకసారి కనులెత్తి జూడుఁడు.

హను—శ్రీరామచంద్రా! కరుణాసాంద్ర! ప్రియసేవకుఁడనగు హను మంతుఁడను. నా మొఱ లాలింపుము. మహాత్మా! మమ్ముద్ధరిం

పుము. సీతామహాదేవి పెట్టిన గడువుదినము చేరువయగు చున్నది. ఇంక నీ దైత్యలోక చక్రవర్తియగు దుష్టరావణ సంహారము కాలేదు. "వానర బలగములతో వారధిఁ గట్టి దుష్టదానవుల సంహరించి నా నాథుఁ డరుదేరి యిఁక నాచెఁ బాపు"నని మిఁగులనాశతో నీ రాకకై యెదురు చూచుచున్న జానకీదేవి కడ కీ యశుభవార్తం గొని నే నెటుల పోవుదును? ఆ సాధ్వీమతల్లి కిం కేమి తెలుపు?

మ॥ "వనవాసంబుననైన సౌఖ్యములు లో పంచెనె? మన్నాథుఁడున్
ఘనుఁడైనట్టి మఱందియుండఁ గడు వేడ్కన్ గాలమున్ బుచ్చ మే
యను మోదంబున వచ్చె భూమిసుతఘోరారణ్యమందుండ వ
చ్చిన కాలం బటువంటిదాటఁ లభియించెన్ గాక యీకష్టముల్.

కైక కోరికఁ దీర్పఁ బితృవాక్య పరిపాలనా ధురంధరుఁడవై యెంతటి వర్షపువేళ యిల్లు బయలుదేరి కాంతారవాసమున కేగుదేరి తివో కాని రాఘవ ! వచ్చినప్పటినుండియుఁ బడలేని యిడుముల పాలై పోతివి కదా— చతుర్వేదంబులు సంగ్రహించి సముద్రమధ్యమున డాగిన సోమకాసురుని సంహరించినట్టి మత్స్యావతారుఁడవే! దేవ దానవుల క్షీరసాగర మధన కాలంబున మందరాద్రి మోసిన కూర్మావ తారుఁడవే! క్రూరహిరణ్యాక్షుని దునిమి జగంబులఁ బ్రోచిన వరాహా వతారుఁడవే! భక్తద్వేషుఁడైన హిరణ్యకశిపుని మర్దించిన నరసింహా వతారుఁడవే! దేవేంద్ర లోకాధిపత్యంబు గోరిన బలిదైత్యచక్రవర్తినిఁ పాతాళంబున కంట ద్రొక్కిన వామనావతారుఁడవే! మదాంధులగు సమస్త క్షత్రియులఁ బరిమార్చిన పరశురామావతారుఁడవే! దశకంఠ కఠోరకంఠలుంఠనమున కేగుదేరిన శ్రీరామావతారుడవే! ఓ! సర్వజగద్రక్షకా! ఇక్ష్వాకు కులచంద్రా! అట్టి నీకా యీ యగ చాట్లు!—(లక్ష్మణునిఁ జూచి) ఊర్మిళాపతీ! సీతారాములు భీకరారణ్య పర్ణశాలనివాస సౌఖ్య మనుభవించు చుండ రేయింబవళ్ళు నిద్రాహార ములు మాని నిరంతరభ్రాతృవత్సలుఁడవై వారల సంరక్షణఁ జేయు

చుండు ధీరుఁడవు. నీవుకూడ యిప్పుడిఁక నిర్విణ్ణముఖుఁడవై పడి యుంటివేల? "నామఱఁది తనకు లక్ష్మణుని మిగుల దుర్భాషలాడితిని గాని, యాతని నవియెల్ల మఱచిపొ"మ్మని జానకీదేవి చెప్పిన మాటల నీతో నేనుబలుక, "మారుతీ! నా వదినముగ్ధ" యని యనినవాడవే! స్వామిభక్తి! అంత ముగ్ధరాలగు నాయువనీజాతి దురవస్థపాలైపోయినది. ఇఁక నైన నాపతివ్రతామతల్లినిఁ గాపాడుకొనుటకు మేలుకొనవేల? శ్రీరామ సేవకుడనై, మున్నొకమారు శుభవర్తమానముఁ గొనిపోయి జానకీదేవితో, "అచిరకాలములో నీనాథుఁ డరుదేరి, పంక్తికంధరుని సంహరించి, నిన్నుఁ జేకొనిపోవు"నని చెప్పినవాడను. కటకటా! మఱల యిప్పుడే తేరి, "తల్లీ! శ్రీరామలక్ష్మణు లిరువురు నింద్రజిత్తు నాగపాశమునకు బద్ధులై"రని యెట్లుదెలుపుదును? ఆ పతివ్రతా శిరోమణికేమి ధైర్యముఁ గఱపుదును? దైవమా!

విభీ—రాఘవేశ్వరా! శరణుఁజొచ్చిన యీ విభీషణునైన నొకసారి కనులెత్తిచూడుము. దీనజనబాంధవుఁడవే!—సద్గుణసాంద్రుఁడవే!—కరుణాసింధుఁడవే!— శ్రీరామచంద్రా! అట్టి నీకా యీ యుగచాట్లు? లేక లేక నా దశరథభూపాలునకు వృద్ధాప్యమున జ్యేష్ఠపుత్రుఁడవై జనియించి యీ ప్రాయమున సాకేతపురముఁ బరిపాలించుచుండవలసిన వాడవు కటకటా! ఆకైక కావరములెట్టివోగాని, రాఘవా! నిన్నిట్టి యిక్కుమల పాలు చేసెనుకదా!

శా. రామా! నాపయిఁ బ్రేమచేత నకదా! "ప్రాజ్ఞుండు, పుణ్యుండు, క్షోణీమాన్యుండు, విభీషణుం"డనుచు, సుగ్రీవాది కీశాళితో
నే మేమో వచియించుచున్, గరుణ నన్వీక్షించు దేవుండవే!
యేమైపోయెనో? యంతప్రేమ యిపుడేలనూ! చూడ వెంతేఁయుఁగా?

భ్రాతృవాత్సల్య విశేషముచేతనేనా? స్వామిభక్తి! నీవిప్పుడు కూడ శ్రీరామచంద్రుని విడువక శుశ్రూషలఁ జేయుచుంటివి.

(గరుత్మంతుఁడు ప్రవేశించి)

(తనలో) మాయాయుద్ధనిపుణుఁడైన మేఘనాథుని నాగాస్త్రమునకు రామలక్ష్మణులు బద్ధులై పడిపోయియుండిరి. నే నిప్పుడు వీరలను బంధవిముక్తులఁజేసినఁ గాని దుష్టదానవసంహారము పూర్తిగాదు. అప్పుడుగాని లోకోత్పాతము లడఁగవు. (అని రామలక్ష్మణుల బంధవిముక్తులఁజేసి నిష్క్రమించును.)

అందరు—(సంతోషముతో) శ్రీరామచంద్రా! జయము! జయము! జయము!

రాము—ప్లవంగశ్రేష్ఠులారా! రాక్షససైన్యంబు లంతరించినవి. మేఘనాథుఁ డదుగో యామ్యుత్తర దిశం గాచియున్నవాడు.

లక్ష్మ—(కోపముతో) ఏడీ? ఆక్రూరదానవాధము నిప్పుడే దునుమాడెద. అగ్రజా! నీవు నన్నాశీర్వదింపుము.

రాము—(నవ్వుచు) తమ్ముఁడా!

మ॥ పరిపంథివ్రజముఁ వధించి, త్రిజగ ♦ ద్భారంబునుఁ దీర్పఁగాఁ
గర మేపారఁగ నింద్రజిత్తుని సమీ ♦ కక్షోణిఁ జెండాడి, సు
స్థిరకీర్తిఁ వహింపుము లక్ష్మణ! ధరి♦త్రీ భాగమం దీవు, వే
గిర మే కల్గు జయంబు పొమ్మిఁకను నీ♦కే మేలు ప్రాప్తించెడుఁ.

నాయాశీర్వాదబలముతో నీ వాయింద్రజిత్తుని దునుమాడుము.

(తెఱలో) మాయాయుద్ధనిపుణుండు- త్రిజగద్విజయుండగు నీయింద్రజిత్తునిఁ దునుమాడువా డెవఁడురా?

లక్ష్మ—వానరవీరులారా! ఆదైత్యాధము నెదుర్కొనుఁడు. లోకకంటకుఁడగు నీదుష్టాత్ముని యొక్కనైనను జాలివిడనాడి సంహారింపవలయును. జాగుసేయకుఁడు.

(ఇంద్రజిత్తు ప్రవేశించి)

ఓరీ! డింభకా! వృద్ధరాక్షసులం జంపుట పరాక్రమమా? అందు దానిబట్టి నిష్కారణముగా ముక్కుచెవులంగోయుట ప్రతాపమా? రమ్ము, నీరుండవేని నన్నెదిరించి పోరాడుము. (అని బాణమువిడచును)

లక్ష్మ—అసురకులాధమా! నీపరాక్రమ విక్రమంబు లెంతరా?

(అని బాణము విడచును)

ఇంద్ర—ఓరీ! మదాంధా! పుట్టినదాది ఘోరారణ్యభూముల నాక లంబుబదిని వంబులంగడపుచున్న నీవు,నాపరాక్రమవిక్రమంబు లధిక్షేపించుచున్నావుగా! (అనివేలోకబాణమువిడుచును)

విభీ—సౌమిత్రీ! యీదుర్మార్గు డాంగీరస బాణప్రయోగముచేంగాని గతింపండు. మీా రద్దానిం బ్రయోగించుండు.

లక్ష్మ—విభీషణా! అటులనే యొనర్చెదను.

(ఇంద్రజిత్తు నుద్దేశించి) ఓరీ! అల్పజ్ఞాన ధురంధరా! ప్రళయ నిర్ఘాత నిభంబగు మదీయ దివ్యాస్త్రరాజంబుచే నిన్నిప్పుడే తుద ముట్టించెదం జూడుము.

సీ॥ శ్రీరామచంద్రుండు ♦ శ్రితజనపాలుండై,
శ్రీమహావిష్ణువై ♦ చెలంగనేని
సీతామహాదేవి ♦ శ్రీ యాదిలక్ష్మియై
భవ్యచారిత్రయై ♦ పరగనేని
విమలక నేనెప్డు ♦ పృథివి సద్భక్తితో
భ్రాతృసేవలంజేయు ♦ వాడనేని
అంజనీసుతుండు పుణ్యాత్ముండై, శ్రీరామ
భక్తుండై ననిశంబు ♦ వరలెనేని

తే॥ గీ॥ శరణుజొచ్చిన యీవిభీషణుండుముందు.
వరగ లంకాపురంబేలువాడయేని

నీవు నాదుబాణంబుచే ♦ జీవములను
పీడి, పడిపోవుదువుగాక ♦ పృథివిమీద.

(అని బాణము విడచును)

ఇంద్రి—హా......(అని మృతుండగును)

విభీ—సౌమిత్రీ! యీకూ్రరాత్ముని పనియైనది.

లక్ష్మ—విభీషణా! పోయి యగ్రజుని కలసికొనుదము, రమ్ము.

(అని యిరువురు నిష్క్రమించును) [ తెఱపడును]

---

## రంగము—౩.

### ప్రవేశము - అశోకవనము.

(సీత దుఃఖముతోఁ బ్రవేశించును.)

అక్కటా! ఏనాటికి దైవము నాకనుకూలుఁడై మమ్ముల నీ యిడుమలనుండి కడతేర్చునోకదా! ఏనాటికీ దుష్టరావణుని వధియించి శ్రీరాఘవేశ్వరుఁడు నన్ను జేకొని పోవునోకదా! దైవమా! నా యీదుస్థితి యెప్పటికొక్కటే విధంబున నున్నయది. అంజనీపుత్రునితో నేనవిన గడవుదినము సమీపించుచున్నది. జరుగుచున్న సంగ్రామవృత్తాంతములేమియు నాకుఁ దెలియవాయె. ఏమిసేయుదును? శ్రీరామలక్ష్మణులు వానరబలగములతో రక్షోనివహంబులఁగూల్చి జయముఁ బడయుదురుగాక!

(తెరలో) సుపార్శ్వ! నన్నేల యడ్డగించెదవు?

తే॥ గీ॥ జానకీ సతికతన నాశనము కలిగె
నింత మహారాజ్యమున కింక ♦ చింతయేల?

యీ యబల నిప్పుడే వధియింతుఁగాన
బాధపెట్టకు నన్ను సుపార్శ్వ! నీవు.

సీత—(భయముతో) ఏమీ? ప్రళయకాలరుద్రుఁడై దశకంఠుఁ డిచ్చట కేగుదేరుచున్నవాడు. ఏమి కీడు మూఁడునో కదా!

(ఖడ్గహస్తుఁడై రావణుఁడు, సుపార్శ్వుఁడు ప్రవేశింతురు.)

రావ—(కోపముతో) సుపార్శ్వ! నా యీ క్రోధాగ్ని యిప్పుడు జానకీదేవి రక్తముతోఁగాని చల్లారదు. ఈ ఖడ్గముతో నీయమ శిరమిప్పుడే ఖండింతును. నీవు న న్నడ్డగింపకుము.

సుపా—పంక్తికంఠరా! ఇది నీకు పాడికాదు. స్త్రీహత్యాదోషము నేలఁ గట్టుకొనియెదరు?

రావ—(కోపముతో) స్త్రీహత్యాదోషమేమి? నాకోరిక తీరకఁబోవుట యటులుండ, యీ పిశాచము నాకు తటస్థించినప్పటినుండియే నాలంకారాజ్యమునకుఁ జేటు సంభవించినది. ఎందరెందరో రాక్షసవీరాగ్రేసరులు గతియించినారు. మీదుమిక్కిలి నాయనుఁగుఁబుత్రకుఁడు— అమితబలసంపన్నుఁడు— నాయంతవాఁడైన యీయింద్రజిత్తు మరణించినాడు. సుపార్శ్వ! నాకింత కీడు సంభవించుటకు హేతుభూతమయిన యీ జానకి నిఁకఁ జంపక విడువను. నన్ను వారింపకుము.

సుపా—రాక్షసేశ్వరా! రణరంగమున గతియించిన వారలఁగూర్చి ముల్లోకవిజయులగు మీరొక యబలఁ జంపి తగని యపఖ్యాతి పాలగుటకన్న ప్రబలశత్రులగు రామలక్ష్మణులతోఁ బోరి పరాక్రమ్యముఁ దీర్చుకొని చిరకీర్తినొందుట శ్రేయస్కరము.

రావ—సుపార్శ్వ! మంచిది.

(తెఱలో) ఓ దైత్యలోక చక్రవర్తీ! మమ్ముల నీ నర వానరులు బ్రతుకనిచ్చుటలేదు. రణమున నేగుదేరి మాప్రాణములఁ గాపాడుఁడు.

సుపా—లంకేశ్వరా! వేగిరమే యిఁక రణరంగమునకుఁ బోవుదము, రండు.

రావ—రాక్షస వీరులారా! భయపడక నిలచి పోరుఁడు. ఇదిగో యిప్పుడే నేనుకూడ వచ్చుచున్నాడను.

(అని నిష్క్రమింతురు)

[తెఱపడును.]

---

రంగము ౪

ప్రదేశము-యుద్ధభూమి.

(రాముఁడు-లక్ష్మణుఁడు, కుంభకర్ణుఁడు-రావణుఁడు పోరుచుందురు.)

రాము—అసురాధములారా! నరవానరుల ప్రతాపము లింకనైన మీకు తెలియ లేదుగా! రండు, రండు.

(అని బాణము విడచును)

లక్ష్మ—కుటిలాత్ములారా! అసంఖ్యాకములైన రాక్షససైన్యము లంత రించినను మీ మదం బణఁగలేదుగా! ఇదిగో నా యీబాణము సైఁకఁ గాచికొండు. (అని బాణము విడచును.)

రాము—విభీషణా! హనుమదంగదాదులతో—సుగ్రీవా! నీవు కూడ యిటు మఱలుము. రావణ కుంభకర్ణులతో యుద్ధ మారంభ మైనది.

(విభీషణ హనుమదంగదాదులు, సుగ్రీవుఁడు ప్రవేశింతురు.)

లక్ష్మ—వానర శ్రేష్ఠులారా! కుంభకర్ణు నెదుర్కొనుఁడు.

(అందరు కుంభకర్ణు నెదుర్కొందురు.)

కుంభ—(కోపముతో) ఓరీ! మదాంధులారా! రండు, రండు. నాకా హారముఁగండు. క్రిందటిదినమున యుద్ధమందలి నాశక్తిసామర్థ్యములు మీరు గుర్తింపలేరి కాబోలు! (అనిమ్రింగఁబోవును.)

రామ:—(కోపముతో) ఓరీ! దుష్టాత్మా! నిన్నిప్పుడూరక విడిచి పెట్టరాదు. నా యీ వైష్ణవాస్త్రముచే నిన్ను తుదముట్టించెదఁ జూడుము. (అని ప్రయోగించును.)

కుంభ—హా.................. (అనిమృతుండగును.)

రావ—(కోపముతో) ఓరీ! నరాధమా! దయఁదలఁచి నిన్నూరక విడచినందుల కెంతటి ఘోరకార్య మాచరించితివిరా? ఇక నిన్ను విడుతునే? (అని బాణము విడుచును.)

లక్ష్మ—(కోపముతో) రాక్షసాధమా! అఖండ బలసంపన్నులగు నీ రామ లక్ష్మణుల జయింప నీకు శక్యమగునే? ఇదిగో నా యీ బాణముఁ గాచికొనుము. (అని బాణము విడచును.)

రాము—(కోపముతో) ఓరీ! రావణా! ఎంతటి పరాక్రమవంతుఁడవురా!

సీ॥ నీమూలమున, లేడి♦యై మమ్ము వంచించి
దివి కేగె మారీచుఁ ♦ డవని మున్ను
నీమూలమున, నంజ♦నీపుత్రునెదిర్చి
తొందరో యని గతి♦యించినారు
నీమూలమున నిటు♦సౌమిత్రితోఁబోరి
మేఘనాథుఁడువోయె ♦ మిఱ్ఱుఁబాసి
నీమూలమున రావ♦ణా! మదోద్రేకుఁడై
కుంభకర్ణుఁడిపుడు ♦ కూలినాడు

తే॥ గీ॥ మిగిలియుంటివొక్కండ వీ ♦ జగమునందు
నేలమరణించెదవు గాక ♦ యీవుకూడ!
హితము లాలించి సీత స♦ర్పింతు వేని
బ్రతికిపోదువు నిశ్చింతఁ ♦ బం క్తికంఠ!

అట్లు కాదేని నీయింద్రజిత్తు, కుంభకర్ణులకువోలె నీకుఁగూడ మరణము నిక్కవమగును. (అని బాణము విడచును)

రావ—(కోపముతో) కుటిలాత్మా!

తే॥ గీ॥ కాననంబులఁ దిరుగుచుఁ ♦ గందమూల
ములను మెక్కెడు నీవేడ? ♦ భూరియశుఁడ,
మించి ముల్లోకములను జ♦యించినట్టి
ప్రముఖబలుఁడను నేనేడ? ♦ ప్రాణమున్న
శరణుజొత్తునే నీకు సం♦గరముమాని?

పసివాడగు నింద్రజిత్తుని లక్ష్మణుఁడు సంహరించిన మాత్రము నను, నిరంతర నిద్రాసక్తుఁడగు కుంభకర్ణు నీవు వధియించిన కతము నను మీయిరువుర పరాక్రమములు వెల్లడియాయెనా! వీరుఁడవేని నీప్రతాపము నాపై జూపుము. (అని బాణము విడుచును.)

లక్ష్మ—(కోపముతో) త్రిభువనవిజయుఁడననియు, మాయాయుద్ధ నిపుణుఁడననియు విఱ్ఱవీగుచుంటివి కాని, యీ రామలక్ష్మణుల యొగుట నీవెంతమాత్రము కొంగాఘు.

(అని బాణము విడచును.)

రావ—(తనలో) వీరలపరాక్రమము లత్యద్భుతములుగా నున్నయవి. విడచిపెట్టక యీ లక్ష్మణు నిప్పుడే నామాయాశక్తిని వినియోగించి మూర్ఛనొందింపవలయును. (ప్రకాశముగా) దురాత్మా!

నీతో నేటి కీసంగ్రామము బూర్తియగుచున్నది. ఏమి తుళ్ళి పడితివదవు! (అని శక్తినిఁ బ్రయోగించును)

లక్ష్మ—హా! అగ్రజా! (అని మూర్ఛ నొందును.)

రాము—(దుఃఖముతో) లక్ష్మణా! యిది యేమిఘోరము?

విభీ—రాఘవా! చింతిల్లినఁ బ్రయోజనములేదు— సుగ్రీవా! యీ యాపద కడచుటెట్లు?

సుగ్రీ—సుషేణా! తెలుపవేమి?

సుషే—మారుతీ! నీవు సమర్థుడవు. పంక్తికంఠుని మాయాశక్తిచే సౌమిత్రి యిప్పుడు మూర్ఛనొందియున్నవాడు. సూర్యోదయము కాకమున్నె నీవెటులైన ద్రోణాద్రికరిగి యందున్న విశల్యకరణిఁ గొనిరావలయును. దానిచేఁగాని యీలక్ష్మణుఁడు జీవింపఁడు. శీఘ్రమే పోయిరమ్ము.

హను—మహాత్మా! అటులనే పోవుదును.

అంగ—హనుమంతా! జాగువలదు.

జాంబ—సూర్యోదయమైన పిమ్మటఁ బ్రయోజనముండదు. మారుతీ! వేగమే కొనిరావలయును సుమా!

హను—శ్రీరామచంద్రా! సెలవొసంగుదురే!

రాము—మారుతీ! శుభమగుగాక! పోయిరమ్ము.

(హనుమంతుఁడు నిష్క్రమించును)

(లక్ష్మణునిఁ దొడలపై నిడుకొని రాముఁడు చింతిల్లుచుండును)

హా! రఘువంశపయఃపారావార రాకాసుధాకరా! హా! లోక కంటకాసురసంహారణధురంధరా! హా! సమస్తసంగ్రామజయాంక రా!

హా! మదాజ్ఞానుచరా! హా! సోదరా! సోదరా! నీకిదియేమి మూర్ఛరా! ఎల్లవేళల నీపాపిష్ఠి యగ్రజునిగూర్చి, నిద్రాహారములు వర్జించి కాయక్లేశముఁ జెందుచు మరవస్థల సైపుచు నుచితోపచారములు సలుపుచుండెడివాడవే? ధర్మమార్గప్రవర్తకుఁడవే? తమ్ముఁడా! నీ కీపాటు యెట్లు సంభవించినది? పుట్టినదాది నన్నువిడువక నట్టి యవసరమేమియు లేనిదే నాకంటె యెక్కు డిక్కట్టులందుచు నేనన పంచప్రాణముల విడచుచు భక్తిపరవశుఁడవై—పరమశాంతుఁడవై— ప్రముఖసద్గుణ సంపన్నుఁడవై—పరోపకారపారీణుఁడవై— పావనచరితుండవై ప్రవర్తించుచుండువాడవే! లక్ష్మణా! లక్ష్మణా! ఎట్టికష్టచయము నాపై బడినను నుంతైన జింతలేక, తమ్ముడా! నిన్ను చూచుకొనుచు కదా! యెంతో సంతసముతో మెలఁగుచుంటిని. అనుజా! అనంతసమున కిది యేమి యంతరాయము? సోదరా! నీవే నాకులేనియెడల దురదృష్టరాలగు నాజానకీదేవి యిఁక యెందులకు? ఆ యయోధ్యాపురరాజ్యమెందులకు? ఈ బ్రతుకెందులకు? సమస్తవిశ్వజనస్తవ్యుఁడవై— సకల భోగభాగ్యభాస్వతుఁడవై యీ యయోధ్యాపుర పైడిమేడల, మృదుల శయ్యాతలములందున, నిఖలసేవకా సపర్యలఁబడయుచు నాయూర్మిళా! సతితో నీ నవయౌవనముఁ గడపవలసివాడవు కదా తమ్ముడా! యీ నిర్భాగ్యుఁడగు నగ్రజునిగూర్చి కన్నతల్లినివీడి, కట్టుకొనిన పత్నినిఁబాసి సర్వసౌఖ్యముల విడనాడి, యీ దుర్గమారణ్యభూములఁ గందమూలాదులతోఁ దృప్తివహియించుచుఁ బడలేనియిడుమలఁ బడుచుండెడివాడవే? "కైక పదునాలుగేండ్లు వనవాసము నాకు కోరినదికాని తమ్ముడా! నీకేల?" యని నేను వారింప "శ్రీరామచంద్రా! నిన్నువిడచి నేనొక క్షణమైన బ్రదుకఁజాల" నని నన్ను వెంబడించినవాడవే! ఇప్పుడువ న్నీరీతి నెడబాయుట నీకెట్లు సంభవించినది? తమ్ముడా! యిది యేమి వైపరీత్యము!

తే॥ గీ॥ గహనవాసంబు పరిపూర్తి • కాగ నాకు
సీతతోడ నయోధ్యకుఁ • జేరు నడల
"రాఘవా! తమ్ముఁడేటికి • రాకపోయె"
నను సుమిత్రకేమి తెలుపు•దునుర? యనుజ!

కర్ణకఠోరమగు నీవార్త నాయూర్మిళకెటులఁ దెలుపుదును? హా! సోదరా! నిన్నిందు విడనాడి నేనిఁక సీతతో రాజ్యాపేక్షచే నయోధ్యకుఁ బోవుదునా? అలనాడు "లక్ష్మణా! సీత భద్రము సుమా!" యని చెప్పి, నే నా మాయామృగమునకై చనిన కొంత తడవున కాభూజాతను నొంటిగా విడచి నీవు నన్ను చేరునప్పటికి నేను మిగులఁ గోపమునఁ "సీతనొంటిగా నేల విడచి వచ్చితివిరా?" యని మందలింప, సదయహృదయుఁడవై-సానురాగుఁడవై-శాంతవచనుఁడవై "అగ్రజా! ముగ్ధరాలగు నావదిన నన్ను మిగుల దుర్భాషలాడినదని" యనినవాడవే? తమ్ముడా! దురదృష్టరాలగు నాముగ్ధను గూరిచి యేనా నీవిప్పుడిట్టి దురవస్థలపాలైపోతివి! సుమిత్రాపుత్రకా! పవిత్ర చారిత్రకా! నీకిట్టి దుఃస్థితిఁజేకూర్చిన దౌర్భాగ్యుఁడగు నీయన్న నొక సారి కనులెత్తిచూడుము. హా! హతవిధీ! సూర్యోదయమగుట ఇంక నొక జామైనను పూర్తిగ నున్నటులఁ దోపఁదు. విభీషణా! సుగ్రీవా! సుషేణా! భానుం డుదయించకమున్నె నాసోదరుఁడు ద్రోణాద్రిగల విశల్యకరణిచేఁ బ్రబోధితుండు కావలయును కదా! అద్దానిఁ దెచ్చుటకు వెడలిన నాంజనేయు డింకను రాడయ్యె! ఏమిసేయుదము?

విభీ—శ్రీరామచంద్రా! మూర్ఛాగతుఁడైన లక్ష్మణుని గూర్చి సర్వజ్ఞులగు మీరే యింత యధైర్యపడి ఖేదమొందిన నింక మముఁ బోంట్లు నిలువఁ గలుగుదురే? సమర్థుడగు హనుమంతుఁడు శీఘ్రమే రాఁగలఁడు, ఊఱడిల్లుఁడు.

సుగ్రీ—రాఘవా! సౌమిత్రి పునర్జీవితుఁడు కాకమున్నె భాస్కరుఁ డుదయించునే? భానుకుల సంజాతుల కాపదకలిగిన నభిమాన

మాని భానుఁడుమాత్రము సాయముఁ జేయ కుండునే? చింతిల్లకుఁడు.

సుషే—ఇంత యచిరకాలములో వచ్చుటకు ద్రోణాద్రి యుండెందు న్నది? అన్నగరాజంబుమీఁద దక్క విశల్యకరణి వేఱొండు చోట లభింపదు. అద్దాని సాధించుకొనిగాని మారుతి రాఁ జాలఁడు.

అంగ—భల్లూకేశ్వరా! ఆద్రోణాద్రి విషయము సర్వము నీవెఱుఁగు దువు కదా!

జాంబ—ఇచ్చట కది బహుదూరముననున్నయది. దుర్భరావస్థలఁ జెంది శాత్రవాసుర మాయాజాలంబులకుఁ జిక్కక నద్దానిఁ గాచి యుండెడు గంధర్వ యోధవరుల జయించి తేవలయును. మా రుతి చనిన కార్యమెట్టిదియైన ఫలియించునుగాన రాఘవేశ్వరా! మీ రధైర్యమొందకుఁడు. ఇఁక నచిరకాలములో లక్ష్మణుఁడు పునర్జీవితుఁడు కాఁగలఁడు.

రాము—(దుఃఖముతో) ప్లవంగ శ్రేష్ఠులారా! నాకెంకెక్కడి దుఃఖోప శాంతి? హనుమంతుఁ జేతేరుట యెక్కడ? ఈ లక్ష్మణుఁడు పున ర్జీవితుఁడవు టెక్కడ? కటకటా! నలుదెసలఁ దెల్లవాఱుచున్నది. ఏయొక్క మహాత్ముడైన విచ్చేసి నాకీ యాపదఁ బాపఁడేమి? భానుకులసంజాతులు విపత్సాగరంబునఁ బడిరని దయఁదలచి భానుఁడు నిజగతి బాయునే? (తూర్పుదిక్కు జూచి మిగుల కోపముతో) ఔరా! యీభాస్కరుని కండకావరమేమి?

తే॥ గీ॥ రయమునను వాయుపుత్రుండు ♦ రాకమున్నె
యూర్మిళాపతి యీమూర్ఛ♦నుండి లేచి
పూర్ణహర్షంబు నీయక♦మున్నె మాకు
భాస్కరా! యుదయింతువే? ♦ భద్రమిఁక!

(అని బాణము నెక్కుపెట్టును.)

విభీ—దాశరథీ! శాంతి వహియింపుఁడు. అదుగో! మారుతి ద్రోణాద్రి తోడనే వచ్చుచున్నవాడు.

హను—(ద్రోణాద్రితోఁ బ్రవేశించి) శ్రీరామచంద్రా! సేవకుఁడను, నమస్కరించుచున్నాడను.

రాము—(కౌఁగిలించుకొని) మారుతీ! నీయుపకారము వేయిజన్మముల కైన మఱువఁజాలను. (సుగ్రీవుని జూచి) కిష్కింధాధీశ్వరా! యికఁ గర్తవ్యమేమి?

సుగ్రీ—(సుషేణునిజూచి) సుషేణా! జాగేమిటికి? ఈ యద్రింగల విశల్యకరణి నెఱిఁగినవాడవు నీవే! అద్దానిచే నీలక్ష్మణుని బున ర్జీవితుని జేయుము.

అంగ—ఆలస్యమెందులకు? లెమ్ము, లెమ్ము.

(సుషేణుఁడు విశల్యకరణిఁజూప లక్ష్మణుండు మూర్ఛనుండి లేచును.)

జాంబ—(నవ్వుచు) శ్రీరాఘవవిజయమంతయు హనుమంతునితోనే యున్నది.

లక్ష్మ—(కోపముతో) అగ్రజా! ఆ మాయాయుద్ధనిపుణుఁడగు రావణుఁ డెందున్నవాడు? పోయి వాని నిప్పుడే నెదిర్చి సంహ రించుకొని వచ్చెదను.

రాము—తమ్ముఁడా! ఆదుష్టదానవుఁడు నిన్ను మూర్ఛాగతుని జేసిన వెంటనే యుద్ధముమాని వెడలినాడు. మిగుల డస్సియుంటిమి గాన మనముకూడ నేటికిఁక సంగ్రామమున జాలించి వెళ్ళు దము.

(వానరులు ప్రవేశించి)

శ్రీరామచంద్రా! మాయాజాలుండగు పంక్తిగ్రీవుఁడిప్పుడు పాతాళహోమాయుధం జేయుచున్నవాడు. నేటితో యుద్ధి సమాప్తము గునఁట!

రాము—విభీషణా! రావణుండేల యీ సమరమధ్యమునఁ బాతాళ హోమము మొదలుపెట్టి యుండును?

విభీ—కౌసలేయా! నిర్విఘ్నముగ నాతఁడది పూర్తిగావించునెడల మన కజేయుఁడగునుగాన మనమిప్పుడెట్లైన నాహోమమునకు విఘ్నములం గూర్పవలయును.

లక్ష్మ—అట్లైన నింక నాలస్యమేలకు? పోవుదము రండు.

(అని యందఱు నిష్క్రమింతురు)

[తెర పడును.]

---

రంగము ౫

ప్రదేశము—పాతాళహోమవాటిక ప్రాంతము.

(హనుమంతుడు ప్రవేశించును)

ఆ విభీషణునిపన్నుగడ బాగుగానేయున్నది. పట్టపుదేవియగు మండోదరి నంగదుఁడు కొప్పుఁబట్టి యీడ్చినఁగాని పంక్తికంఠునకు మాపై కోపము నెత్తికెక్కదు. కోపము నెత్తికెక్కినఁగాని ప్రాణపత్నీ రక్షణార్థమై మమ్ములఁ దునుమాడఁ బాతాళహోమమునుండి లేచి రాఁడు. లేచివచ్చినఁగాని హోమదీక్షావిధానభంగము కానేరదు. అతని హోమమునెట్లైనఁ జెఱచుటయేకదా మాకిప్పుడు కర్తవ్యము! పతివ్రతామణియగు మండోదరీదేవిని గొప్పుఁబట్టి యీడ్చుకొనివచ్చుటకు యంగదుఁడే సమర్థుఁడు. వాలిపుత్రునకు సాయముగా నేనిప్పు డాతనివెంటఁ బంపఁబడితిని. నేటితో రావణుని హోమము పూర్తికాఁగుగాన జాగు లేక నింక స్వామియగు శ్రీరామచంద్రునియాజ్ఞ

నిర్వర్తింపవలయును. (అని దూరముగఁజూచి) అంగదా! వేగిర మిటు రమ్ము.

(అంగదుఁడు ప్రవేశించును)

(వ్రేలితోఁజూపుచు) ఆంజనేయా! హోమవాటిక యదియే కదా!

హను—అవును. అదియే! నీవుకడుభద్రముగ స్వామియాజ్ఞ నిర్వర్తింప వలయును. సాధ్వియగు మండోదరికూడ యాసమీపముననే కూర్చునియున్నది.

అంగ—మారుతీ! అటుచూచుము. రావణుడెంత దీక్షాపరుడై యున్నవాడో! మనకిదియే సమయము!—ఆప్రక్కనున్నవాడెవ్వఁడై యుండును?

హను—వాడే సుపార్శ్వుండు! నే నిందుండెదఁగాని యాలసింపకఁ బోయి మనమిచ్చట కేగుదేరిన కార్యముఁ గానిమ్ము.

అంగ—పోవుదును.

(అని పోయి మండోదరిని గొప్పఁబట్టి యీడ్చును)

మండో—(దుఃఖముతో) హా! నాథా! ఇంక నేమిహోమము? ఏమి నీమము? ఎంతమానము? ఎట్టిపౌరుషము? కనికరము కలుఁగదా? మీహృదయము వజ్రసమమా? పాషాణసదృశమా? ఈయవమానము నుభరింతురే? ఈ వానరుని విడచిపెట్టుదురే? కనులెత్తిచూడుఁడు. పట్టపుదేవిని, వెఱపుఁజెందక శత్రుసైన్యమందలి యొకవానరుఁడు విచ్చేసి యవమానపఱచుచుండ జూచిసహింతురే? నిజదారాపరితాపగ్లానిదొలఁగించి యిప్పుడీ క్రూరమర్కటు నొకనిఁబొలియింపఁజాలని మీరు, లంకాపురీ రక్షణార్థమై యవతారపూరుషులైన యా శ్రీరామ లక్ష్మణు

లను - ఆ వానర బలగములను సంహరించుట యెట్లు?—
సపరివారంబుగా సంగ్రామము బూనినప్పుడే సాధింపజాలని
యా శ్రీరాముని—సజ్జన స్తోముని మీరింక నీ జపతపాముల
మూలమున జయించెదరే? మనోహరా! యిదియేమి వెఱ్ఱి?
ఇకనైన నాపల్కు లాలింపుఁడు. పరమపావనియగు నా జానకీ
దేవినిఁ గొనిపోయి శ్రీ రాఘవున కర్పించి శరణు వేడుకొని
ధన్యులుగండు. ఈలంకాపురము నింతమాత్రముతో నిలుపుఁడు.
మమ్ములఁ గాపాడుఁడు. మనోహరా! లేచిరండు.

రావ—(కోపముతో లేచివచ్చి యంగదుని జూచి) ఓరీ! మదాంధా!
ఇదివఱ కేటులో బ్రతికిపోతివి. మఱల వచ్చితివా? చూడుము.
నిన్నిప్పుడే చంపెదను. (అని గ్రుద్దును.)

సుపా—(దూరముననుండి) ఓ! దైత్యకులనాథా! యీ హనుమంతుని
చేతిలోఁ జచ్చుచుంటిని. వేగరమే వచ్చి రక్షింపుడు.

రావ—(కోపముతో)ఓరీ! దురాత్మా! ఎంతటిబలశాలివిరా? నిలువుము,
నిలువుము.

(అని పరువిడిపోవునప్పటికి హనుమంతుఁడు సుపార్శ్వునిజంపి
నిష్క్రమించును.)

రావ—(దుఃఖముతో) ఈ దైత్యరాజ్యంబున కేమిపాట్లు సంభవించు
చున్నవి. ఈ సుపార్శ్వుఁడుకూడ మరణించినాడు. సంగ్రామ విజ
యాపేక్షచే దీక్షాపరుడనై చేయుచున్న యీ పాతాళహోమ
మింతటితో భంగమైనది. శత్రువులు మీాదకు వచ్చుచున్నారు.
ఏమి సేయుదును?—

మండో—మనోహరా! యిఁకనైన నాదాశరథితోఁ గయ్యము మా
నుఁడు. సీతాదేవిని గొనిపోయి యర్పింపుడు; ఆమహాత్ముని
శరణుగోరుడు. నాథా! నామాటఁ ద్రోసివేయకుఁడు.

రావ—(కోపముతో) ఛీ! ఛీ! భీరురాలా? ఎట్టి దీనోక్తులాడుచుంటివి? నీవిఁక నా యెదుటనుండి తొలఁగిపొమ్ము. లేనియెడల—

(తెఱలో) దైత్యేశ్వరా! శత్రుసైన్యములు మమ్ముల బ్రతుక నిచ్చుటలేదు. త్వరితమే వచ్చి రక్షింపుఁడు.

రావ—రాక్షసవీరులారా! భయముఁజెందకుఁడు. ఇదిగో వచ్చుచున్నాఁడను. (అని నిష్క్రమించును)

[తెఱపడును]

---

రంగము—౬.

ప్రదేశము—యుద్ధభూమి.

(విషణ్ణవదనుఁడై రావణుఁడు ప్రవేశించును.)

అక్కటా! కాల మెంతలో నెంతగా మాఱినది? ఎట్టి వైపరీత్యమును కనుచున్నాఁడను? లోకత్రయవిజయుఁడనైన నేనిప్పుడు కదనరంగమున విగతపరివారుఁడనై- దుర్భరావమానభరితుఁడనై-భగ్నమకుటుఁడనై-సహాయశూన్యుఁడనై మిగిలితినికదా! దైవమా! నా తమ్ములగు విభీషణ కుంభకర్ణ వాక్యములగాని, దేవియగు మండోదరి హితములఁగాని నేనేల వినకఁబోతిని? ఇన్నిఁటికి మూలమైన యాభూజాతను నేనేల తెచ్చితిని? ఇఁక రామలక్ష్మణుల జయించుటమాత్రము దుస్సాధ్యముగాఁ దోఁచుచున్నది. లంకారాజ్య వినాశకాలము ప్రాప్తమైనది. ఇప్పటికైన నాజానకీదేవిని గొనిపోయి రాముని—(కొంచెమాగి) ఛీ! యెంతమాట? పులస్త్యబ్రహ్మవంశమున జనియించి, లోకముల జయించి, దిగంతకీర్తిగాంచిన యీరావణుఁడిప్పుడు

నిజపరాక్రమవిక్రమంబులం గోల్పోయి యొక్కనరాధమునకుం జేతులు జోడించుదునే? దైత్యకులంబునకు లేనిపోని కళంకముం దెచ్చిపెట్టుదునే?

(తెఱలో) ఓరీ! దైత్యాధమా! ఎందుం బోయెదవు? నిలువుము.

రావ—నీచాత్మా! వీరుఁడవేని రమ్ము. కోతిమూకలం జేర్చుకొని యీ రావణుని జయించు తలంపున నుంటివేమో? రామలక్ష్మణుల రక్తముం గ్రోలునంతవఱకీ దైత్యలోకేశ్వరుని క్రోధము చల్లారదు.

[రాముఁడు, లక్ష్మణుఁడు, విభీషణుఁడు, సుగ్రీవుఁడు, అంగదుఁడు, హనుమంతుఁడు, జాంబవంతుఁడు, వానరసేన ప్రవేశింతురు.]

రాము—(కోపముతో) ప్రళయకాలనిర్ఘాతనిభంబులై నీ ప్రాణములం గొనునట్టి నా యీశరజాలంబుం బ్రయోగించుచున్నాఁడను. కాచికొనుము. (అని ప్రయోగించును.)

రావ—(కోపముతో) నీశరజాలప్రయోగమేమై పోయినదిరా? నిన్నిక వేగిరమే కడతేర్చెదను. చూడుము. (అని బాణము విడుచును.)

లక్ష్మ—(క్రుద్ధుఁడై) ఓరీ! డింభకా! నీపరాక్రమము మాకడనేమిటికిం గొఱవచ్చునురా? నీకంత్యకాల మాసన్నమైనది. వేగిరపడకుము. (అని బాణము విడచును.)

రావ—(తనలో) అక్కటా! నాపరాక్రమ విక్రమంబులు నా యమోఘ శరప్రయోగములు నీరామునియెదుట వ్యర్థమైపోవుచున్నవేలనోకదా? రాముని ప్రయోగములన్నియు భీమముగా నన్ను బాధించుచున్నవి. నా పక్షమున నాసారథితోఁగూడ నెల్లరు గతియించినారు. నేనొక్కరుఁడను మిగిలితిని. దైవమా! యీ రామలక్ష్మణుల జయించుటెట్లు? —(కొంచెమాగి) నా మరణరహస్యమీ నరవానరులకేమియెఱుక? బొందిలో జీవంబు

లుండువఱ కీశతుచ్ఛులతోఁ బోరుదుఁగాక! (ప్రకాశముగా) ఓ మదాంధులారా! మీరాత్మాత్రశౌర్యముల కీపంక్తిగ్రీవుఁడు భీతివహియించునే? ఈకదనరంగమువీడి పఱువిడిపోవునే? మీ శరణు జొచ్చునే?—

తే॥ గీ॥ త్రిభువన విజయుఁడైన యీ ♦ దివిజవైరి
పంక్తి కంధరుఁ డుగ్రుఁడై ♦ బ్రతికియుండ,
రాజ్య మేలింపఁ గలవె ధై ♦ ర్యమున నీవు
జగతి నరుఁడవై యీ విభీ ♦ షణుని నింక?

మిమ్ములను, మీ యుభయహస్తముఁ గొనిన యీ విభీషణు నిప్పుడే పరిమార్చెద. చూడుఁడు. (అని బాణమువిడుచును)

రాము—విభీషణా! చిత్రముగా నున్నదే'

తే॥ గీ॥ తెగియుఁ గ్రమముగా వెనువెంటఁ ♦ దేజమందు
దనుజనాథుని శిరములు ♦ ధరణియందు;
కారణంబేమి యున్నదో ♦ కాని, వీని
సంహరింపుట యనిఁ గడు ♦ శ్రమగఁదోఁచు.

విభీ—రాఘవా! మున్న రావణుం డమృతభాండమును మ్రింగియున్న వాఁడు. అద్దాని మహిమంబువలనను, బ్రహ్మ వరంబునను నీ తఁడు మడియకుండును. గర్భకోశమందున్న యాయమృతభాండ మును పావకాస్త్ర ప్రయోగముచే దహింపఁజేయుదు వేని పంక్తికంఠుఁడు మృతుండగును. మనకు జయము లభియించును.

రాము—ఈ లంకేశుని మరణరహస్య మిదియా! మంచిది. (రావణునిఁ జూచి) రాత్రించరాధమా! యింక నేమి తుళ్ళిపడియెదవు? ఈ పావకాస్త్రముచే నీ యాటోప మడగించెదను. కాచికొనుము.

(అని ప్రయోగించును.)

రావ—(క్రిము నభినయించి) విభీషణుని ద్రోహమిది! ఈ పావకాస్త్ర మమోఘము! (అని భూమిపైఁబడును.)

లక్ష్మ—అగ్రజా! యీ దైత్యుని యాటోప మడఁగినదికదా! మూఁడు లోకములు క్షేమము వర్ధిల్ల, సంతసించును.

విభీ—(రావణుని జూచి) దైత్యలోకేశ్వరా! నీ కీపాటుఁదులకు గాను కలిగినది? "శ్రీరాముఁ డవతార పూరుషుఁడు. సీతామహాదేవి నర్పించి శరణువేడు కొను"మని నే నెన్ని హితములఁ జెప్పినను వినక పోతివికదా! అగ్రజా! కుంభకర్ణుని వాక్యములఁ గాని, తుదకు నీ దేవిశకు మండోదరి నీతులఁగాని నీవు పాటించినచో నిట్టి హీనస్థితి యీ లంకా రాజ్యమునకుఁ బట్టకుండును కదా! లోకత్రియ విజయుఁడవై—దిగంతయశోవిశాలుఁడవైననీవిప్పు డిట్టు లవమాన భరితుఁడవై దుర్మరణంబును—అవతార మూర్తి చేతిలోఁజచ్చుట దుర్మరణంబు కాదు గాని—నీమరణ మునకు—నీ లంకా రాజ్యవినాశమునకును—యీ దైత్యకులక్ష యము నకును నీవే కారకుఁడవై యీ సంగ్రామరంగమున దుర్భ రావస్థలపాలై పడియుంట యెందులకు కాని యిప్పటి కైనను యీ రాఘవుని శరణుగోరి హతశేషులగు మమ్ముఁగూడి యీ లంకా రాజ్యము నిరాటంకముగాఁ బరిపాలింపుము. శరణు జొత్తువేని దీనజనసంరక్షకుఁడగు నీ యిక్ష్వాకుకులచంద్రుఁడు నిన్ను కనికరమున నిప్పటికైనఁ గాపాడును. నీ మూలముననే కదా! దేవే ద్రి లోకము నట్లుంచి మిగుల శోభిల్లుచున్న యీ లంకాపుర మింత హీనస్థితికి వచ్చినది. నిన్ను గూరిచి కదా యెల్లభువనముల జయింపజాలిన శక్తిసామర్థ్యములు గల నీ తనూఁగుఁ బుత్రుఁడు మేఘనాదుఁడును, సోదరుడు కుంభ కర్ణుఁడును, నింక నెం ద రెందరో రాక్షసవీరులును,నీ సకల పరి వారంబును నశియించిరి. రాత్రించరేశ్వరా! యింక దేలయుద్ధా గతి పాలయ్యెదవుగాని యిప్పుడైన నామాట బాటిస్తేము.

రావ—(మిగుల కోపముతో) ఛీ! ఛీ! పాపాత్మా! పరమభాగవతోత్త
మునివలె నీవు నాకు నీతులఁ గఱపుచుంటివా? కడసారి తమ్ముఁ
డవైన నీకు నీదురదృష్ట వశమున లంకారాజ్య పరిపాలనార్హత
లేదను యేడుపుతో, నీ కష్ట సుఖముల విచారించుచు నా
యనుఁగుఁ బుత్రుని కన్న మిన్నతి గారాబమున నఱచేతులలోఁ
బెంచి పెద్దవానిఁ జేసిన వాఁడను. తండ్రియంతవాఁడను. అగ్ర
జుఁడనగు నన్ను విడనాడి "విభీషణా! అభయహస్త మిచ్చితిని.
రావణుని సంహరించి లంకా పట్టము నీకుఁ గట్టెదను" అని నా
పక్షమందలి రహస్యముల భేదింప మెల్లన దగ్గరకుఁ జేరఁదీసిన
నా గర్భశత్రువగు నీరాముసిఁ జేరి రా[illegible]గల భ్రాంతిచే
భ్రాతృవాత్సల్యమును సంపూర్తిగా విడిచి నాముద్దుల తన
యుఁడగు నింద్రజిత్తు గతియించుటకుఁగాని, సోదరుఁడగు
కుంభకర్ణుఁడు హతమొందుటకుగాని, యెందరెందరో రాక్షస
వీరులు మరణించుటకుగాని, నా సకల పరివారమంతరించుటకు
గాని, నాలంకారాజ్య మిట్టిహీనస్థితికి వచ్చుటకుగాని, నాయీ
దుస్థితికి గాని కారణమైననీవు నేనుపోయిన పిమ్మట నీ రాజ్యా
ధిపత్యము వహియించి యేమిసుఖములఁ బడయుదువో, యెట్టి
భోగములందుదువో, యెంతటి కీర్తివహియించుదువో బాగుగా
విచారించు కొనుము. ఎంత కులభ్రష్టుఁడవు! ఎట్టి భ్రాతృద్రో
హుఁడవు? శత్రునిచేతిలో దెబ్బతిని పడిపోయిననన్ను, నాబాధను
నాదుస్థితిని జూచి యొకగర్భమున జనియించిన తమ్ముఁడవై
యుండి తగినయుపచారములు సలిపి యెటులైన బ్రతికింపవలసిన
వాడవైయుండి కుటిలాత్మా! నా శత్రుపక్షమువిడువక నామరణ
మునే సంతసమునఁ గోరుచున్నవాఁడవు కదా! సంగ్రామరంగ
మునఁ బడిపోయి వీరస్వర్గారోహుఁడఁగానున్న నేను, నీమొగ
మిప్పుడు చూచినంతమాత్రమున నరకలోకమునకుఁ జేరుదు
నేమోకాని ఛీ! ఛీ! ద్రోహుఁడా! నా యెదుటనుండక దూర
ముగఁ బొమ్ము.

సుగ్రీ—దశకంధరా! కాలము మంచిదికాకపోయిన నెంతటివారి కైనఁ గష్టములు తప్పవు. దీనజనబాంధవుఁడగు నీ రఘురామ చంద్రుని శరణుజొచ్చుటయే నీకిపుడు శ్రేయస్కరము.

అంగ—రావణా! దుర్మదాంధుఁడవైకదా యిప్పుడు నీవీ ఫలముఁ గంటివి! ఇఁకనైన సన్మార్గుఁడవై యేల బాగుపడరాదు?

హను—లంకేశ్వరా! నీ శ్రేయముఁగోరి వచియించెదు మా పలుకుల నించి యిప్పటికైన రాముని శరణుజొచ్చి సుఖంబున

బ.

నీ శ్రేయః

జ్ఞానవృద్ధుఁడనగు నాహితములనైన వినుము.

మని కర్పించి శరణు వేఁడుకొనుము. ఈ భక్త జనసంరక్షకుఁడు తప్పక నీయాపదఁ బాపును. మునుపటి నీ లంకారాజ్యము స్వేచ్ఛగా నీవు పరిపాలించుకొనవచ్చును.

లక్ష్మ—శ్రీరామచంద్రా! యీ కుటిలాత్ముని మద మింక నణఁగ లేదు. దేవతలందఱు రావణుని మరణమునకై పుష్పవర్షముఁ గురిపింపఁ గాచుకొని యుండిరి. శీఘ్రమే యీ దైత్యాధముని సంహరింపుఁడు.

రాము—లక్ష్మణా! సంహరించెదను. (రావణునిఁ జూచి) ఓరీ! దుర్మతీ! నీ సంహారమునకై మూఁడులోకములు కాచుకొని యున్నవి. త్రిజగత్కంటకుఁడవగు నిన్నిప్పుడే యీ బ్రహ్మాస్త్రముచే సంహరించి యెల్లరకు సంతసముఁ జేకూర్చెదఁగాక!
(అని బ్రహ్మాస్త్రముఁ బ్రయోగింప రావణుఁడు మృతుండగును)

విభీ—(దుఃఖముతో) హా! అగ్రజా! (అని రావణునిపైఁ బడును)

రాము—సౌమిత్రీ! నా ప్రతిజ్ఞానుసారముగా నీ విభీషణుని నీవు లంకా రాజ్యమున కభిషిక్తునిఁ జేసిరమ్ము. పొమ్ము.

లక్ష్మ—మహాప్రసాదము! (అని విభీషణునితో నిష్క్రమించును)

రాము—మారుతీ! వేగిరమే నీవేగి పతివియోగదుర్భర వ్యసన స్వాంతమైయున్న సీతా దేవికి మద్విజయం బెఱిఁగింపుము.

హను—మహాప్రసాదము! (అని నిష్క్రమించును)

రాము—సుగ్రీవా! మన మిఁకఁ ద్రికూటాచలమున కరుగుదమురమ్ము.

సుగ్రీ—వెళ్లుదము. (అని యందరు నిష్క్రమింతురు)

[తెఱపడును]

---

రంగము ౭

ప్రదేశము—త్రికూటాచ

(రాముఁడు - లక్ష్మణుఁడు - విభీషణుఁడు - సుగ్రీవుఁడు-అంగదుఁడు హనుమంతుఁడు - జాంబవదాదులు - సీత ప్రవేశింతురు)

రాము—తమ్ముఁడా! యిన్నిమాటలేల? ఈ సీతాదేవిని నేనిఁక నేలను.

లక్ష్మ—(దుఃఖముతో) రాఘువేశ్వరా! యిదియేమిమాట!—జనక మహాచక్రవర్తియింట నీ వా శివువిల్లు విఱచినది యగ్రజా! సద్గుణశీలయగు నీ సీతామహాదేవిని గూర్చియేకదా! అలనా డా మాయాకురంగమును వధించుటయు, నీ సుగ్రీవాదులతో సఖ్య మొనరించి వాలిని సంహరించుటయు, వారిధిబంధించి లంకా రాజ్యముపై దాడివెడలి దుష్టరావణుని హత మొనరించుటయు మహాత్మా! సాధ్వీమణియగు సీజానకీదేవిని గూరిచియేకదా! ఇంతకాలము సరియైన నిద్రాహారముల వర్జించి, సర్వసౌఖ్యములవీడి, దురవస్థలపాలైతిమి రామచంద్రా! పతివ్రతాశిరో